# శతక సౌరభం

డాక్టర్ కె. గోపాలకృష్ణారావు

# శతక సౌరభం

తెలుగు శతక వాఙ్మయంలోని ఆణిముత్యాలకు
వన్నె తెచ్చే వ్యాఖ్యానం


రచన :

డాక్టర్ కె. గోపాలకృష్ణారావు

రీడరు, తెలుగుశాఖ
ఉస్మానియా విశ్వవిద్యాలయము



ప్రచురణ

రిజిష్టర్డ్ నెం. 1/64

యువభారతి
సాహితీ సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

SATHAKA SOURABHAM
Selections from 'SATHAKA VANGMAYAM'
By Dr. K. Gopala Krishna Rao


యువభారతి

ప్రచురణ : 46

ప్రథమ ముద్రణ : ప్రతులు 2,200

21, నవంబరు, 1976

ముఖచిత్ర రచన :

శీలా వీర్రాజు

ముద్రణ :

జ్యోతి ప్రెస్, ముషీరాబాదు, హైదరాబాదు.

ముఖచిత్ర ముద్రణ :

నందిని ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు

ప్రతులకు :

యువభారతి

5. కింగ్స్‌వే, సికిందరాబాదు-500 003

లేదా

యువభారతి కార్యాలయం

ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు.

తిలక్ రోడ్, హైదరాబాదు-500 001

వెల రూ. 2-00

Paper used for the Printing of these Books
was made available by the Government of India
at Concessional Rates

YUVABHARATHI IS GRATEFUL

# విన్నపము

సంస్కృత, ప్రాకృత, కన్నడ శతకాలను ఆదర్శంగా గ్రహించి తెలుగులో పన్నెండో శతాబ్దిలో శతక మావిర్భవించింది. ఈ ఎనిమిది వందల ఏండ్లలో తెలుగు శతకం శాఖోపశాఖలుగా విస్తరిల్లి స్వరూపంలోనూ, స్వభావంలోనూ, ఎంతో మార్పునొందింది. భారతీయ భాషల్లో ఎందులోనో శతక ప్రక్రియ తెలుగులోవలె బహుముఖ వికాసాన్ని పొంది వైశిష్ట్యమునొంద లేదు. అది దేశి ప్రక్రియ అనే భ్రమకలిగే విధంగా అభివృద్ధినొందింది. నేటికీ ఏ మూలనో ఒకచోట ఒక శతకం వెలువడుతూనే ఉన్నది. సజీవస్రవంతివలె అవిచ్ఛిన్నంగా సాగుతూ వస్తున్నది శతకమే అని సంభావించినా అతిశయోక్తి కాదు. నేటికి ముద్రితా ముద్రిత శతకాలసంఖ్య నాలుగైదువేలకు మించి పోయిందని పండితుల అంచనా.

శతకంలో కనీసం నూఱు పద్యాలైనా ఉంటాయని ఆ పదమే సూచిస్తుంది. ఈ లెక్కప్రకారం తెలుగులో ఉన్న శతక పద్యాల సంఖ్య కనీసం నలభై, యాభై వేలకు మించి ఉన్నదన్నమాట. అత్యధిక ప్రచారాన్ని పొందిన ముప్పది పద్యాలనే కూర్చి వ్యాఖ్యానించి సహృదయుల ఆలోచనోద్యానవనంలో తెలుగు శతక కుసుమసౌరభాన్ని గుబాళింపజేయుమని ఆదేశించినారు యువభారతీ మిత్రులు. శతక సాహిత్యాన్నిగూర్చి పరిశోధన చేసినానుకదా! ఇదేమంత ఘన కార్యం - నల్లేరుపై బండినడక - మూడు నాల్గురోజుల పనేకదా! అని తటాకమే అంగీకరించినాను. కలంపట్టి రచనమారంభించేసరికి అహంభావం క్షణంలోనే అంతరించింది. యువభారతివారు గడుసువారు, గురుతరమైన బాధ్యత నప్పగించి నారని అప్పుడు తెలిసింది. రంగురంగుల కాంతులు వెదజల్లే రత్నరాసులమధ్య కూర్చొబెట్టి రెండు మూడు మంచి రత్నాలు మాత్రమే చూపుమనటంవంటిదీ పని అని అనుభవంవల్ల తెలిసికొన్నాను. శతకాలతో పరిచయముందికదా! కష్టపడితే

కాని కార్యమా ? అని భావించి ఆత్మప్రత్యయంతో సంకలన మారంభించినాను. మళ్లీ ప్రధానమైన సమస్య ఒకటి ప్రత్యక్షమైంది. ప్రశస్త పద్యాలు - బహుళ ప్రచారాన్ని పొందిన పద్యాలనే ఎన్నుకుంటే తెలుగు శతక వాఙ్మయం ఎన్నెన్ని శాఖలలో అవాంతరశాఖలలో వికాసాన్ని పొందిందో తెలపటం కష్టం. భక్తి నీతి శృంగార, వైరాగ్య, తత్త్వ అధిక్షేప, శతకాలతోనే సామాన్యులు పరిచితులు. తెలుగు శతక మింతకంటె వైవిధ్యాన్ని వైలక్షణ్యాన్ని స్వరూప స్వభావంలో క్రొత్తదనాన్ని సంతరించుకొన్నది. ఈ వైశిష్ట్యాన్ని సామాన్యులకు చూపాలనే కుతూహలంవల్ల పద్యసంఖ్యల యువభారతివారి సూచన పరిమితిక మించి పోయింది. శతక సౌరభంతోపాటు సౌందర్యాన్ని కూడా దర్శింపజేయాలనే కుతూహలంతో కొన్ని శతకపద్యాలు బహుళప్రచారాన్ని పొందకపోనాయి, వానికిగల వైశిష్ట్యాన్ని దృష్టిలోఉంచుకొని కొన్ని పద్యాలను చేర్చినాను. ఈ మధ్యేమార్గంవల్ల అటు యువభారతి వారినీ, నా కుతూహలాన్ని సమన్వయించి సౌరభసౌందర్యాలకు సమ్మేళనం కలిగించినానని నాకు, తృప్తి కలిగినట్లైందని తోచింది. మరి పాఠకులేమనుకుంటారో ? అనువాదమైనా, సంకలనమైనా స్వతంత్ర రచనకంటె కష్టసాధ్యమైన కార్యమని నా విన్నపం. వివిధ శాఖలకు, దృక్పథాలకు, ప్రతీకలుగా నిలువదగిన పద్యాలను సంతరించి కవి హృదయాల్ని ఆవిష్కరించే ప్రయత్నం చేసినాను. ఫరవాలేదు బాగానే ఉందని మెచ్చుకుంటే సంతోషిస్తాను. లోపాలున్నాయని తెలిస్తే సవరించుకుంటాను. ఇంకా కొన్ని మంచి శతకాలు, మిగిలినాయికదా అని మనసు తహతహలాడుతూనే ఉంది. కొండను అద్దంలో చూపిన ప్రయత్నమిది.

కె. గోపాలకృష్ణారావు.

# నందిని

మీ ఆత్మీయులతో ఆనందం పంచుకోండి

ఒక్కరూపాయికే "నందిని" నందించండి !

ఆత్మీయులు దూరంగా ఉన్నప్పుడు మన అభిమానాన్ని తెలుసుకుందామనీ, వారిని పలుకరించి, వారిని మారు పలికింప చేయటంలో ఆనందం పంచుకుందామనీ, ఆత్మీయత పెంచుకుందామనీ అభిలషిస్తాము. పండుగ సందర్భాలలో గ్రీటింగ్ కార్డులు పంపడం ఈ అభిప్రాయంతోనే కదా.

కేవలం ఒక్క రూపాయితో భారతదేశంలో మీ సన్నిహితు లెక్కడున్నా సరే-వారు మిమ్మల్ని సంవత్సరం పాటు గుర్తుంచుకునేలా, యువభారతి సంస్థతో పరిచయం కలిగించినందుకు మిమ్మల్ని అభినందించేలా చేయగలుగుతుంది "నందిని".

ఎనిమిది పేజీల్లో ఒక చక్కని సంస్కారాన్ని పరిచయం చేస్తూ, వారు నందినిని అందుకునేందుకు కారణమైన మిమ్మల్ని సంవత్సరంలోని పన్నెండు నెలలూ గుర్తుంచుకునేలా, మీ ఆత్మీయతకు క్రొత్త అనుబంధాన్ని పెనవేయగలుగుతుంది. అటు అందుకుంటున్న వారికి ఆనందం, ఇటు అందిస్తున్న మీకు సంతృప్తినీ సమానంగా పంచిపెడుతుంది- "నందిని", అందుకే అర్థిస్తున్నాము మీ నుండి కేవలం ఒక్కరూపాయి+మీ మీ ఆత్మీయుల చిరునామా.

మీ రెన్ని రూపాయిలైనా పంపవచ్చు, అన్ని చిరునామాలూ పంపాలన్నది మాత్రం గుర్తుంచుకోండి.

వేల మంది సహృదయులకు సన్నిహితం కావాలన్న లక్ష్య సాధనకు తోడ్పడండి.

## అందుబాటులో ఉన్న
## సాహిత్యవాహిని
## తరంగాలు

| | | |
|---|---|---|
| 1. మందార మకరందాలు | ... | రూ. 2-00 |
| 2. ప్రజాసూక్తం | ... | ,, |
| 3. వేమన్న వేదం | ... | ,, |
| 4. వడగళ్లు | ... | ,, |
| 5. నా గొడవ | ... | ,, |
| 6. శ్రీనాథుని కవితా వైభవం | ... | ,, |
| 7. విశ్వనాథ కవితా వైభవం | ... | ,, |
| 8. శిఖరాలు - లోయలు | ... | ,, |
| 9. సిందూరం | ... | ,, |
| 10. భావన | ... | ,, |
| 11. మెరుపులు | ... | ,, |
| 12. చేమకూర కవితా వైభవం | ... | ,, |
| 13. తిక్కన కవితా వైభవం | ... | ,, |
| 14. చలం ఆలోచనలు | ... | ,, |
| 15. భారతీ వైభవం | ... | ,, |
| 16. తిమ్మన కవితా వైభవం | ... | ,, |
| 17. ధూర్జటి కవితా వైభవం | ... | ,, |
| 18. తులసీదాసు కవితా వైభవం | ... | ,, |
| 19. నన్నయ కవితా వైభవం | ... | ,, |
| 20. ధర్మపథం | ... | ,, |

# శతక సౌరభం

నా యొడయుండ నా విభుడ నా హృదయేశ్వర నా మనోరమా
నా యిలవేల్పు నా వరద నా గురు లింగమ నాదుజంగమా
నాయధినాథ నా వరుడ నన్ను గృపామతిఁబ్రోవుమయ్య దే
వా యమిబృందవంద్య బసవా! బసవా! వృషాధిపా!

బసవని నామస్మరణముచేత నే భక్తి పారవశ్యమున సముద్ర తరంగాలవలె ఊయెలలూగేవాడు. శివకవులలో అగ్రేసరుడైన పాల కురికి సోమన. తెలుగు శతకాలకి సమగ్ర స్వరూపము కల్పించిం దీతడే. ఈతడికి ముందు శతక రచనకు మార్గదర్శకుడు మల్లికార్జున పండితారాధ్యుడు. పండితయ్య పన్నెండో శతాబ్దిలో జీవించినాడు. తెలుగులో మొదటి శతకాన్ని రచించిన కీర్తి గౌరవములు మల్లికార్జున పండితారాధ్యునికి లభించినాయి. పండితుడు, శివతత్త్వ సారమనే శతకాన్ని రచించినాడు. దానిలోని మొదటి పద్యములో మల్లికార్జునుడు శివుని మహిమను ఈ విధంగా ప్రస్తుతించినాడు.

శ్రీపతి వాక్పతి ముఖ్య మ
హా పురుషులు నెఱుగఁనోవ రతి వాఙ్మానస
వ్యాపారమైన నీ నిజ
రూపము నే నెట్టిదని నిరూపింతు శివా.

పరమేశ్వరుని నిజరూపము నారాయణుడు బ్రహ్మ మొదలగు వారే సరిగా గ్రహించి వర్ణించలేనపుడు "నేనెట్లు నిరూపింతు"నని కవి వచించినాడు. శివతత్త్వసారము కొన్నివందల పద్యాలున్నాయి. శివా, రుద్రా, మహేశా! మొదలగు మకుటములు గ్రహింపబడినాయి.

శతకమును సమగ్రలక్షణోపేతంగా అష్టోత్తర సంఖ్యానియ తితో ఏకైక మకుటంలో రచించినవాడు పాలకురికి సోమన. వృషాధిప

శతకంలోని మకుటము సోమనకుగల భక్తిపారమ్యాన్ని నిరూపిస్తున్నది. భక్తిశతకములో దాసగుణస్తుతులను, తదితర లక్షణములను అనుసరించుటలో సోమనాధుడు ప్రత్యేక ఆసక్తిని చూపినాడు. అంత్యప్రాసలు-యమకానుప్రాసలు - ముక్తపదగ్రస్తాలంకారములు- మనోహారములైన కల్పనలు. అన్నిటికిమించి శివభక్తిపారమ్యము సోమనాధుని వృషాధిప శతకంలోని విశిష్టగుణాలు. పదములు భావములు ఒకటికొకటి పెనవేసికొనట్లుండును. పరమేశ్వరుని నామగుణ కీర్తన మొనర్చు పద్యాలలోను, భక్తిపారవశ్యాన్ని ఈశ్వరుని మహోమహిమను వర్ణించు సందర్భాలలో సోమన తనకుగల పాండిత్యాన్ని రచనాశక్తిని వ్యక్తీకరించినాడు. పాలకురికి సోమన బహుభాషా పండితుడు. వృషాధిప శతకంలో సంస్కృతము, తమిళము, కన్నడము, అరె మున్నగు భాషలలో పరమేశ్వర కీర్తన మొనర్చిన పద్యాలిట్టివి.

ఆత్మకు పరమాత్మకుగల సంబంధాన్ని నవవిధభక్తి లక్షణాలను సరసంగా వ్యక్తీకరించిన పద్యమిది. దాస్య, వాత్సల్య మధుర భక్తి స్వరూపమును సోమనాధుడు మనోహరంగా నిరూపించినాడు. ఈశ్వరుడాతనికి ఒడయుడు, విభుడు, హృదయేశ్వరుడు, వరదుడు, వరుడు, ఇలవేల్పు, సర్వస్వమాతడే అని చక్కగా వర్ణించి తమవంటి భక్తుల కాపాడుమని ప్రార్థించినాడు. పాలకురికి సోమన భక్తిశతక స్వరూపాన్ని, భావవిన్యాస విధానాన్ని అనంతరకవులెందరో అనుకరించినారు. తెలుగు శతకాన్ని సర్వాంగశోభితం చేసిందితడే. ఈ పద్యమాతని భక్తిపారమ్యానికి ప్రతీక.

కమలములు నీటబాసిన
కమలాప్తునిరశ్మి సోకి కమలిన భంగిన్
తమతమ నెలవులుదప్పిన
దమ మిత్రులు శత్రులౌట తథ్యము సుమతీ !

తెలుగునాట అత్యధిక ప్రచారం పొందిన శతకాల్లో సుమతి శతకమొకటి. దీనిప్రశస్తిని గమనించి విద్వాంసులీ శతకాన్ని సంస్కృత కర్ణాటకాంగ్ల భాషల్లోనికి కూడ అనువదించినారు. ఈ శతకాన్ని సుమతి అనే జైనముని ఆత్మసంబుద్ధిపరంగా వ్రాసినాడనీ, అజ్ఞాతకవి యొకడు సుమతిపేర రచించినాడనీ, భీమనకృతమని, వివిధ అభిప్రాయలను వాఙ్మయ చరిత్రకారులు వెల్లడించినారు. కాని అన్ని ఆధారాలను సమన్వయించి భద్రభూపాలుడుగ ప్రసిద్ధి వహించిన బద్దెన నీతిశాస్త్రముక్తావళి అనే రాజనీతి ప్రధానమైన శతకంతోపాటు సుమతిశతకాన్ని కూడ రచించినట్లు పండిత విమర్శకులు భావించినారు. కుమార సంభవకర్తయగు నన్నెచోడుని వంశీయుడే ఈ బద్దెన. అపారమైన లౌకిక పరిజ్ఞాన సంపన్నుడైన ఈ కవి నీతిశాస్త్రముక్తావళిలో, రాజధర్మములు, సైనిక ఆర్థికవ్యవస్థ, యుద్ధనీతి, పరిపాలనా యంత్రాంగము మొదలగు అంశములను వివరించినాడు. తెలుగులో ఇదే మొదటి రాజనీతి శతకం.

రంగురంగుల రత్నాలహారంవలె సుమతిశతకంలో నానా విధములైన నీతులు మనోజ్ఞమైన రీతిలో కూర్చబడినవి. పదబంధాలు, లోకోక్తులు, శబ్దార్థాలంకారాలు, గనాయతిప్రాసలప్రత్నంగా అమరినట్లు సుమతిశతక పద్య రచన హృద్యంగా సాగింది. అన్వయక్లేశం కాని అలౌకికభావంకాని పద్యాల్లో కనిపించదు. అతిగంభీరమైన సత్యాన్ని సామాన్య ధోరణిలో వ్యక్తీకరించటం ఈ శతకంలో గమనించదగిన విశేషం. వీటిలో ఉన్నంతవరకూ సూర్యుని కిరణస్పర్శతో మురిసే పద్మాలు, ఆ స్థానాన్ని వీడినపుడు, ఆ వేడితోనే వాడిపోవునట్లు తమతమ స్థానములు వదలినచో తమమిత్రులే శత్రులౌతారని కవి ఈ పద్యంలో సరసంగా మనసులో గాఢంగా నాటుకునే రీతిలో ఉపదేశించినాడు. పద్యపునడక రాజహంసను పోలినది. కమలములవలె కోమలములైన పదాలు శబ్దాలంకారాల నమర్చినాయి. 'మిత్ర'

శబ్దంలోని శ్లేషచమత్కృతి మనోజ్ఞమైంది. సూర్యుడు, స్నేహితుడని అర్థంగల శబ్దమది. ఉపమానం సుపరిచితమైనది. మిత్రులు-శత్రులు అనే పదాలలోని "త్ర" భావపుష్టికి శబ్దాలంకృతికి దోహదంచేసే ప్రయోగం. 'తథ్య' శబ్దమున ఆ విధంగా జరగటం తప్పదు అనే హెచ్చరిక గర్భితమైయున్నది. రాజకవి బద్దెన రచనలోని గాంభీర్య మిట్టిది.

అందవు కోసియిమ్మ్మ విరులంచును జేరలమేలు మంగ ని
న్నందగఁ గోరఁ జెక్కులట నొక్కిన నాకును నందవంచు, న
య్యిందు ముఖం ప్రియంబలర నెత్తుచుఁ బువ్వులు కోయఁ జేయ ని
ష్యంద మరంద ఘర్మరస సంగతు లబ్బెను వెంకటేశ్వరా !

తాళ్ళపాక వంశీయులకు తెలుగు సాహిత్య చరిత్ర విశిష్ట స్థానము లభించటానికి వారు వివిధ ప్రక్రియలలో ప్రశస్తకృతులు రచించటమే కారణం. ఈ కుటుంబంలోని ప్రతివ్యక్తి ఏదో ఒక కావ్యమును సంతరించి కీర్తినొందినాడు. వీరిలో అన్నమాచార్యుడు, తిరుమలాంబ, తిరుమలాచార్యులనే వారు ప్రత్యేకంగా పేర్కొన్న దగినవారు. పదునేనవ శతాబ్దిలో జీవించిన అన్నమాచార్యులు అలిమేలుమంగా వేంకటేశ్వరుల నాలంబముగ దివ్యదాంపత్య శృంగార ప్రధానంగా రచించిన వేంకటేశ్వర శతకంలోని పద్యమిది. ప్రబంధ శృంగారం విశృంఖల విహారం చేస్తున్న కాలంలో అన్నమా చార్యులు వేంకటేశ్వర శతకంలో నూత్నమార్గాన్ని ఆదర్శంగా చూపినాడు. ఒకనాడు మంగాదేవి ఉద్యానవనంలో విహరిస్తున్నది. రంగు రంగుల పూవులు కిల కిల, మందహాసం చేస్తుంటే, వికసించిన పుష్పాలు అపూర్వసౌరభాన్ని గుబాళిస్తుంటే వాని నందుకోవాలని ఎదలో కోరిక తీరికలెత్తినాయి. కనులకు విందొనర్చి, మనసును మురిపించే కుసుమాల్ని కోసికోవాలని ప్రయత్నం చేసింది. ఒక్క

పూవుకూడ అందలేదు. చెంతనే చిఱునగవు చిందిస్తూ నిలుచున్న వేంకటేశ్వరుని చూసింది. "అవి అందటంలేవు కోసి ఇస్తావా" అని ప్రార్థించింది. భక్తులపాటి కల్పతరువు, శ్రీ వేంకటేశ్వరుడెంతటి రసికుడో చూడండి. "నాకు మాత్రం అందుతాయా" అని మెల్లగా చెక్కిలి నొక్కినాడు. అటు లతలపై ఊయెలలూగుతూ వికసించిన విరులు నవ్వులు విసురుతున్నాయి." ఏ పూలు ఇష్టమో! నీకు ఎన్ని కావాలో నాకేం తెలుసు? నీవే కొమ్మనందుకొని కోసికో'' అని ఆ కొమ్మకు సమాధానమిచ్చినాడు వేంకటేశ్వరుడు. ఒక రెమ్మనో ఒక కొమ్మనో వంచితే సరిపోయేదికదా !! మంగాదేవిని లీలగా ఎత్తి పుష్పముల నందజేసినాడు. ఆ స్పర్శతో ముగ్ధసౌకుమార్యము మూర్తీభవించిన మంగాదేవి మేను పులకరించింది. లేజెమటలు శరీరంపై ముత్యాలముగ్గులు తీర్చినవి. ఇరువురి హృదయాలు సాత్త్విక భావోదయంతో రంజితమైనవి. ప్రణయరసాంబుధిలో జలక్రీడలాడిన దివ్యదంపతుల సరసాన్ని అన్నమయ్య ఎంత సరసంగా చిత్రించినాడు !!!

శ్రీ రఘురామ చారు తులసీ దళదామ! శమక్షమాది శృం
గార గుణాభిరామ! త్రిజగన్నుత శౌర్యలలామ! దు
ర్వార కబంధరాక్ష విరామ! జగజ్జన కల్మషార్ణవో
త్తారక నామ భద్రగిరి దాశరథీ! కరుణాపయోనిధీ!

భగవన్నామ గుణ సంకీర్తనం ఓంకార నాద సంకేతంగా మధుర ఘంటికానాదం వినిపించినట్లు తెలుగుదేశంలో వీధిబడులే విద్యామందిరాలుగా విలసిల్లిన కాలంలో బాలబాలికలీ పద్యాన్ని వల్లెవేస్తుంటే తెలుగువారు విని తమలో తాము శ్రీరాముని దివ్య మంగళస్వరూపాన్ని ప్రత్యక్షం చేసికొనేవారు. ఇపుడా సంప్రదాయ మంతరించి ఎవరికి వాళ్ళు చదువుకుని ఆ అనుభూతినే ఆస్వాదిస్తు

న్నారు. భక్తి శతకాలలో పరమాత్ముని నామగుణ సంకీర్తన ముఖ్య ప్రధాన లక్షణం. భక్తి పారవశ్యాన్ని కలిగించటానికి విధమైన స్తుతి దోహదం కలిగిస్తుంది. భక్తరామదాసుగా ప్రసిద్ధినొందిన కంచెర్ల గోపన్న రచించిన దాశరథీ శతకంలో పద్యమిది. రామదాసు కీర్తనలతోపాటు దాశరథీశతక పద్యాలు తెలుగువారి హృదయాల్ని భక్తిరసంలో ముంచెత్తినాయి. కంచెర్ల గోపన్న గోలకొండ సామ్రాజాన్ని పరిపాలించిన తానాషా ప్రభుత్వంలో ప్రధానాధికారులుగ నుండిన అక్కన్న మాదన్నలకు ఆప్తబంధువని ప్రతీతి. బాల్యము నుంచీ రామభక్తుడు. భద్రాద్రిరామ సేవారక్తుడు. అక్కన్న మాదన్నల ప్రాపకంతో భద్రాచల మండలమునకు తహసీల్దారుగా నియుక్తుడై ప్రభుత్వ కార్యకలాపములను నిర్వహిస్తూ శ్రీరాముని నిరంతరం ధ్యానిస్తూ సేవిస్తూ కాలం గడిపినాడు. తన ఇష్టదైవమగు శ్రీరామచంద్రమూర్తి ఆలయము పరిస్థితిని జూచి ప్రభుత్వ ధనాన్ని ఆలయోద్ధరణమునకై వినియోగించి గోలకొండ చక్రవర్తి ఆగ్రహానికి గురియై శిక్షితుడై, కారాగారవాసము ననుభవించి చివరికి శ్రీరాముని అనుగ్రహమున నే బంధవిముక్తుడైనాడు. చిన్నప్పటినుంచి మనసారకీర్తించిన శ్రీరామునే నమ్ముకొని గోవన్న కృతులు రచించి భక్తరామదాసుగా ప్రశస్తి వహించినాడు. రామభక్తి శతకాల్లో ఈ శతకానికి విశేషప్రాచుర్యం లభించటానికి ప్రధానకారణం రామదాసు భక్తిపారమ్యము ప్రత్యక్షరంలో మూర్తీభవించినట్లుండటమే !! అందమైన తులసిదామమును ధరించినవాడు శమదమగుణ సంపన్నుడు, శృంగార గుణాభిరాముడు. శౌర్యగుణ భూషితుడు. రాక్షసుల సంహారించినవాడు. భక్తజనుల కల్మషముల నంతరింపజేయుట కవతరించిన కరుణాపయోనిధి శ్రీరాముడు. భద్రాద్రి క్షేత్రమున వెలసిన దివ్యపురుషుని మనసార ధ్యానించి సాక్షాత్కరించుకొన్న భక్తాగ్రగణ్యుడు రామదాసు.

తాను దర్శించిన పవిత్రమూర్తిని తెలుగు వారి మనోరంగాన సాక్షాత్కరింపజేసినాడు. ఇదే ఆతని రచనలోని జీవగుణం.

రామదాసు భట్టరార్యుని శిష్యుడు. అంత్యానుప్రాస, ముక్తపదగ్రస్తాద్యలంకార శోభితంగా భాగవత భక్తి ప్రధానంగా దాశరధీ శతకాన్ని రచించినారు. అవతారమూర్తులైన సీతారాములు తెలుగు వారికి తల్లిదండ్రులు. ఈ ఆత్మీయభావాన్ని తెలుగు వారికి కలిగించటంలో రామదాసు కీర్తనలు, దాశరధీ శతకం మున్నగు వానికి ఇంతో అంతో పాత్ర ఉందనటానికి సందేహములేదు. చిక్కని పాలపై మిసిమిఁ జెందిన మీఁగడ పంచదారతో మెక్కిన భంగి, శ్రీరాముని విమల రూపసుధా రసమును రామదాసుతోపాటు తెలుగు పలుక నేర్చిన, విన నేర్చిన భక్తుడు అస్వాదించి తరించినాడనటంలో ఏ మాత్రం సందేహంలేదు.

> కాయల్గాచె వధూనఖాగ్రములచే గాయంబు, వక్షోజముల్
> రాయన్రాపడె ఱొమ్ము, మన్మథవిహారక్లేశ విభ్రాంతిచేఁ
> బోయెన్బ్రాయము, బట్టగట్టెదల, చెప్పన్ రోత సంసారమేఁ
> జేయంజాల విరక్తుఁ జేయగదవే శ్రీకాళహస్తీశ్వరా.

తెలుగు శతకాల్లో ఏ శతకం ప్రశస్తమైంది అని ఎవరైనా నిలువదీసి ప్రశ్నిస్తే క్షణకాలం తికమకపడ్డట్లే, ధూర్జటి రచించిన కాళహస్తీశ్వర శతకంలోనిది మంచిపద్యం ఎన్నుకొనటానికి పూనుకుంటే అదే అవస్థ కలుగుతుంది. అహమహమికతో అన్ని పద్యాలు బారులుకట్టి స్ఫురణకు వస్తాయి. మహాకవి ధూర్జటి రచించిన శ్రీకాళహస్తీశ్వర శతక ప్రశక్తి అట్టిది. ఆతని కవితకు మాధురీమహిమ అలవడటానికి వాదవనితాధరామృతపానమే ప్రధాన కారణమని రామలింగకవి రచ్చకీడ్చినట్లు ప్రతీతి. ధూర్జటి భోగ

లాలసుడని, వారంగనాలోలుడని నిరూపించటానికి ఈ పద్యాన్ని ఉదాహరిస్తారు. 'వధూ' శబ్దం కులకాంత అనే అర్థాన్ని ప్రసాదిస్తున్నాడని ధూర్జటి కళంకాతీతుడని విమర్శకులు కొందఱు సమర్థిస్తున్నారు. రసికభక్తశిఖామణియైన ఈ మహాకవి నూనూగు మీసాల నూత్నయౌవనంలో నవనవలాడే నారీమణులతో సుఖించినంత మాత్రాన అతనికీర్తి కిరీటంలోని రత్నాలు రాలిపోలేదు. అత్యంత పవిత్రహృదయుడని వాదించి సమర్థించినా దిగంత విశ్రాంతకీర్తితో వెలిగిపోడు. పర్వతశిఖరాగ్రంనుండి గంతులువేసే సెలయేటిధార గాంభీర్యం, గంగాతరంగాల పరవళ్ళుత్రొక్కే భక్తిపారవశ్యం మాధురీపూరితమై ధూర్జటి కవితా వ్యక్తిత్వాన్ని రాణింపజేసినవి. సతీసుతులతో సంసారసాగరాన కొన్నినాళ్ళు మునకలువేసి, అంగనల అధరామృతాన్ని మనసార అనుభవించి చివరికి విరక్తుడై కాళహస్తీశ్వర సేవానురక్తుడై, స్వర్ణముఖీతీరాన తిన్నని రూపంలో విహరించినాడు. ఆత్మకవితాశక్తికి ముగ్ధులై, అతని లేఖినినుండి అవతరించిన దివ్యకావ్యసుందరిని చేబట్టాలని నరేంద్రులెందరో ఉవ్విళ్ళూరినారు. కాని ధూర్జటి రాజులమ్మత్తులనీ, వారిసేవ నరకప్రాయమనీ, వారిచ్చు నంభోజాక్షీ చతురంతయాన తురగీభూషాదు లాత్మవ్యథా బీజంబు లనీ, ఏనాడో గ్రహించినాడు. వధూనఖాగ్రములచే ఒళ్ళంతా కాయలుగాచినవి. వక్షోజముల రాపిడిచే ఱొమ్ముగాసినొందింది. వయసూ, మనసూ మన్మథవిహార క్లేశవిభ్రాంతిచే జీర్ణించింది. తల బట్టకట్టింది. ఆస్థితిలో చెప్పిన పద్యమిది. ఆత్మానుభూతిని వసందైన పదాలతో వ్యక్తీకరించినాడు. సరసమైన నుడికారం భాషకు సాటి లేని శక్తిని సంతరించింది. జీవితంలోవలె పదబంధ ప్రయోగంలోనూ ధూర్జటి స్వైరవిహారి. సజీవ భాషాప్రయోగాలెన్నో అతని శతకానికి అలంకారాన్ని కూర్చినవి. సంసారబంధనాలనుండి ముక్తిని ప్రసాదింపమని విరక్తుని జేయమని ప్రార్థించిన ధూర్జటి కాళహస్తీశ్వరుని అనుగ్రహాన్ని పొందినాడనుటకెట్టి అనుమానంలేదు.

నీట గలిగిన లవణంబు నీటఁ గలియ
నీరుగాకుండదా విధినిశ్చయముగ
శివుని గలిసిన జీవుండు శివుడుగాడె
నవ్యతర భోగి శ్రీ సదానందయోగి.

తత్త్వశాస్త్రము సముద్రమువలె గంభీరమైంది. ఆత్మపరమాత్మలు - జననమరణములు - ముక్తి స్వరూపము - యోగవిద్య - పంచేంద్రియములు - అరిషడ్వర్గముల తత్త్వము - మొదలగు అంశములెన్నియో ఈ శాస్త్రమున వివరింపబడినవి. సంస్కృతము నందిట్టి శాస్త్రగ్రంథములు శతాధికములు. అగాధమైన శాస్త్రవిశేషాలను తత్త్వవేత్తలు గంభీరధోరణిలోనే వివరించినారు. అది సామాన్యులకు అందని ద్రాక్షపండు. తెలుగుశతక కర్తలు నిగూఢమైన అట్టి తత్త్వాన్ని సుస్పష్టంగా తెలిపినారు. ఉదాత్త గంభీరములైన విశేషాలను అత్యంత పరిచితమైన భాషతో రూపకోపమాల దృష్టాంతములతో నిరూపించిన కీర్తి తెలుగుశతక కర్తలకు దక్కింది. సాధారణంగా భక్తిశతకాల్లో వైరాగ్యతత్త్వం నిర్దేశింపబడింది. తత్త్వం ప్రధానంగా వెలువడిన శతకాల్లో సదానందయోగి, సంపగిమన్న శతకము లాద్యములు విశిష్టములైనవి. వీరిది పీఠికాశగత పాండిత్యం కాదు. తత్త్వాన్ని ఆచరణరూపంలో సాధించి శాస్త్రసముద్రములో మునకలు వేసి అమూల్యములైన సత్యరత్నాలను వెలికి తీసినవారు. ప్రతితత్త్వంలోని అంతర్యాన్ని అరటిపండు ఒలిచి చేతిలో పెట్టినట్లు తెలిపినారు. సదానందయోగి శతకపద్యంలోని తత్త్వనిరూపణ విధానం పరిశీలించండి. అన్వయకాఠిన్యములేక, పారిభాషికపదములతో భావాన్ని జటిలమొనర్చక జీవనతత్త్వాన్ని సుపరిచితమైన ఉదాహరణములతో వ్యక్తీకరించినారు. నీటితో సిద్ధమైన ఉప్పు నీటిలో కలిసి నీరే అగును. శివాంశసంభూతుడై జీవుడు శివుడిలో

ఐక్యమునొంది శివుడే అవుతాడని సదానందయోగి స్పష్టమొనర్చినాడు. సంపగిమన్న శతకము, శివముకుంద, కేవలాత్మ, అప్పాలయోగి, ఆత్మారామ, గురుమౌళి, హంస, రాజయోగి, వెంట, అచల, సోసిలింగ, సదాచార్యశతకముల వంటి శతకములు తెలుగులో శతాధికములుగ రచింపబడినవి. తత్త్వశాస్త్రములోని ప్రతి అంశము ఈ శతకాల్లో సరళరీతిలో సంతరించబడింది. యోగవిద్యారహస్యాన్ని వెల్లడించడంలో కవులు కొందఱు వివిధ సంకేతాలను గ్రహించినారు. ఇళ, పింగళ, సుషుమ్న నాడులను మూడుత్రోవలని, కుండలినీశక్తిని తలక్రిందులుగా వ్రేలాడుతున్న పాము అని సూచించటం, ప్రాణాన్ని హంసగానో, చిలుకగానో రూపొందించటం ఇటువంటిది. తదితర తత్త్వ విశేషాలనింకా నిగూఢంగా కొందరు వ్యక్తీకరించినారు. "గజము నొక్కదోమ కడసి మ్రింగె"—"ఎక్కరాని మ్రానునొక్క వందు ఫలించె"— మల్లనయోగి శతకములోని పద్యభాగము లివి. 'దీని అంతరార్థ మూహించేసరికి తలప్రాణం తోకకు వస్తుంది' అని కొందరు భావించడం సహజమే. అతివిశాలంగాదోచు బ్రహ్మాండము పరంజ్యోతి దర్శనానంతరము స్వల్పాతి స్వల్పమనిపించును. ఈ అంశమునే కవి జగమును దోమ మింగినదను సూక్తిలో సూచింపజేసినాడు. 'ఎక్కరానిమ్రాను' అనే దానికి ఎన్నో అర్థాలు వివరించవచ్చు. బ్రహ్మాండము, సహస్రారము - అసాధ్యమైన కార్యముల అను అర్థాల్లో కవి ప్రయోగించి ఉంటాడు. ఇటువంటి సంకేతాలు తప్ప తక్కిన భాగం సంబోధంగానే ఉంటుంది.

ఇయ్యంగ నిప్పించగ గల
యయ్యలకే గాని మీసమందఱికేలా
రొయ్యకు లేదా బారెడు
కయ్యానికి కుందవరపుకవి చౌడప్పా.

తెలుగు వారికి సుపరిచితుడైన కవులలో కవి చౌడప్ప విశిష్ట మార్గానికి ప్రతీక. నీతులు బూతులు లోకఖ్యాతులురా — నీతుల మాటేమి ఒకింత బూతాడకదొరకు నవ్వు పుట్టదు, అని చాటు అధిక్షేప శతక రచనల్లో వినూత్న మార్గాన్ని అనుసరించినవాడు చౌడప్ప - ఆతని పేరు వినగానే అప్రయత్నంగా నవ్వువచ్చి వేడిగా, వాడిగా, కరకరలాడే పద్యాలెన్నో స్ఫురిస్తాయి. "నేను నవ్వనే నవ్వను" అని మూతిబిగించుకొని శపథంచేసి మౌనముద్రదాల్చిన వ్యక్తిని గిలిగింతలుపెట్టి కిలకిలనవ్వించేశక్తి చౌడప్ప పద్యానికున్నది. భావవిన్యాసంలో, అధిక్షేప హాస్యచమత్కృతిధోరణిలో ఈతని మార్గ మందరికంటె నవ్యమైనది. లౌకికదృష్టి చౌడప్ప శతకములో ప్రధానముగ గోచరిస్తుంది. హాయిగా సుఖంగా జీవించాలని ఆతనిధ్యేయం- ఉపదేశం కూడా. వయసుపడుచుల ప్రక్కలో పండిన దినమే పండుగ అని నమ్మిన రసికాగ్రణి కవి చౌడప్ప - భావాన్ని మాటుగా వ్యక్తీకరించుటలో ఆతనికి సాటివచ్చువారు కొందఱే. కందపద్య రచనలో ఆతనిది అందేసినచేయి. ఆ విశేషాన్ని ఆతడే సగర్వంగా వివరించినాడు. బూతులలో నీతులుపదేశించుటలో, సరసమైన నుడికారమున భావాన్ని సౌష్ఠవంగా వ్యక్తీకరించుటలో చౌడప్ప లేఖిని నిశితమైంది. మగవానికి పౌరుషము ప్రధానమని వివరించునపుడు, "మీసము పస మగ మూతికి" అనుటలో అతని రచనలో భావవ్యక్తీకరణలో కొరడా వంటి చురుకులు ఎట్టివో స్పష్టమగును. మీసము పౌరుషము, సాహసము, దానధర్మము, ఉదాత్తవ్యక్తిత్వమునకు చిహ్నము. ఈ గుణములేవీ లేకుండా "నేను మగవానినికదా బారెడు మీసము పెంచుకుంటాను" అని విఱ్ఱవీగే వారినుద్దేశించి చౌడప్ప చెప్పినపద్యమిది. ఉన్నంతలో దానము చేయుట, ఇతరులచే దానము ఇప్పించుట పౌరుష లక్షణం - అటువంటివారికే మీసము అలంకార ప్రాయంగా గాంభీర్యాన్ని సూచించునట్లుగా ఉంటుంది. ఈ ధర్మములేనివారు

మగముండలు. వారికి మీసమవసరమేలేదు. రొయ్యకుకూడ బారెడు మీసముంటుంది. కాని ప్రయోజనము శూన్యముకదా! అని కవి చౌడప్ప సరసమైన ఉపమాన దృష్టాంతాలతో తనకాలమునాటి పరిస్థితులను సమీక్షించి ఒక్క శతకము మాత్రమే రచించి స్థిరకీర్తి నార్జించినాడు.

పరమలోభిని దివాకరతనూభవుడంచు
ఛద్మచిత్తుని హరిశ్చంద్రుఁడనుచు
నిర్దయాత్మ్ముని రామనృపశిఖామణియంచు
గడుకురూపిని రతికాంతుఁడనుచుఁ
బాపకర్ము నభంగ పాండ వాగ్రజుడంచు
సమరభీరుని సవ్యసాచియనుచు
గుండ బీదను మరున్మండలేశ్వరుఁడంచు
మతివిహీనుని భోజపతియటంచు

కవులు కక్కూర్తి నిసుమంత కడుపుకొఱకుఁ
బొగడుచుందురవివేక బుద్ధులగుచు
బుధనుత విలాసపీఠికాపుర విలాస
కుముదహిత కోటి సంకాశ కుక్కుటేశ.

ఆంధ్ర సాహిత్యచరిత్రలో కూచిమంచి కవులు తమ కృతుల వలన ప్రత్యేక స్థానాన్ని అలంకరించినారు. నీలాసుందరీ పరిణయ కావ్యకర్తగా సుపరిచితుడైన కూచిమంచి తిమ్మకవి భర్గకుక్కుటే శ్వర శతకాలను రచించినాడు. కూచిమంచి కవి ప్రబంధానికి 'పారడీ' వంటి చంద్రశేఖ విలాపమనే ప్రబంధం అధిక్షేప ప్రధానంగా కూర్చినాడు. ఈ సోదర కవుల రచనలు భక్తి నీతి అధిక్షేప రచనలలో

అనంతర కవులకు మార్గదర్శకులైనారు. కూచిమంచి తిమ్మకవి కుక్కుటేశ్వర వరప్రసాద కవితా సామ్రాజ్యధురంధరుడు. సార్వభౌమ బిరుదాంచితుడు, భర్గ, కుక్కుటేశ్వర శతకములీతడి రచనా పాటవమునకు ప్రతిబింబములు. పదునేడు పదునెన్మిదో శతాబ్దులలో కొందఱు కవులు పోషకులకు దాసానుదాసులై అరసికులగు ప్రభువుల అడుగుల మడుగులొత్తుచు, 'చిత్తముచిత్తమనుచు' వారినే ఆశ్రయించి ఇంద్రులనీ చంద్రులనీ పొగడచు కడుపు కక్కూర్తిని దీర్చుకొనుచుండిన అంశమును తిమ్మకవి నిశితముగా ఈ పద్యమున విమర్శించినాడు. ఆనాటి మండలేశ్వరులలో అధికులు రసికతా శూన్య హృదయులు లోభులు - దయావిహీనులు - వారిని జేనెడు పొట్టకై ఆశ్రయించిన కవులను, వారి చిత్తర్వులుని కవి ఈ శతకంలో వివరించినాడు. పరమలోభిని కర్ణునివంటి మహోదాత అని, అసత్య వర్తనుని హరిశ్చంద్రుడని, దయాదాక్షిణ్యములులేని వారిని సాక్షాత్తు శ్రీరామచంద్రుడని, అనాకారుని అంగజుని అవరావతారమని, పాపాత్ముని ధర్మరాజని, రణరంగమున వెన్నుజూపు పిరికివారిని వీరులు సాహసమూర్తులు అర్జునునివంటి వారనీ, సామ్రాజ్యవైభవము గోల్పోయిన నామమాత్రపు రాజులను మండలేశ్వరులనీ, నిరక్షర కుక్షులను, కవుల నీసడించు వారిని భోజమహారాజులని, సామంత రాజులను పొగడుచు జీవనము కొనసాగించే అవివేక బుద్ధులను కూచిమంచి తిమ్మకవి మందలించినాడు. ఆత్మాభిమానమున నుండాలని కవులకుపదేశించినాడు. తన ఇష్టదైవాన్ని ఉద్దేశించి వ్రాసిన శతకంలో కూచిమంచి కవి సమకాలిక పరిస్థితులను వ్యక్తుల మనస్తత్వాన్ని సరసంగా చిత్రించిన విధానానికి ఈ పద్యం మచ్చుతునక.

ఆలు నిర్వాహకురాలు భూదేవి యై
యఖిల భారకుఁ డను నాఖ్యఁ దెచ్చె

నిష్ట సంపన్ను రాలిందిర భార్యయై
కామితార్థదుఁ డన్న ఘనతఁ దెచ్చెఁ
గమలగర్భుడు సృష్టికర్త తనూజుఁడై
బహు కుటుంబకుఁ డన్న బలిమిఁ దెచ్చెఁ
గలుష విధ్వంసిని గంగ కుమారి యై
పతిత పావనుడన్న ప్రతిభఁ దెచ్చె

నాంధ్రు బిడ్డలు దెచ్చు ప్రఖ్యాతి గాని
మొదటి నుండియు నీవు దామోదరుడవె!
చిత్ర చిత్ర ప్రభావ! దాక్షిణ్యభావ
హత విమత జీవ! శ్రీకాకుళాంధ్ర దేవ!

ప్రాచీనాంధ్ర కవులలో ఒక్కొక్క రొక్కొక విధముగ తమ తమ కవిత్వ ఆదర్శాలను నానావిధాలుగా చాటినారు. పదునెన్మిదో శతాబ్దిలో జీవించిన కాసుల పురుషోత్తమకవి వ్యాజోక్తి ప్రధానముగ "కీర్తి నిందగ గేలిపఱతు" నని శ్రీకాకుళ స్వామి నుద్దేశించి ఆంధ్ర నాయక శతకమును రచించినాడు. వాజోక్తిని ఒకటి రెండు పద్యాల్లో అనుసరించిన పూర్వకవుల సంఖ్య బహుళమే కాని వ్యాజోక్తి ప్రధానంగా కావ్యం వ్రాయటం అది శతకరూపమున వెలువడటం శతకవాఙ్మయ వికాసములో ప్రత్యేక ఘట్టమని భావింపవచ్చు. వ్యాజోక్తిలో నిందాగర్భితమైన స్తుతియే ప్రధానంగా భాసిస్తున్నది. ఇటువంటి శతకం వ్రాసిన వారిలో కాసుల పురుషోత్తమ కవి ప్రథముడని కీర్తి వహించినాడు. ఆంధ్రభాషలో పోతన భాగవతాన్ని వ్రాయకుంటే కాసుల పురుషోత్త కవి వ్రాసి ఉండేవాడని సాహిత్య విమర్శకుల మతము. ఈ శతకకర్త కవితాశక్తిని ఈ అంశమే నిరూపించటానికి చాలు.

పోతనాది మహాకవుల శ్రేణిలో ప్రముఖస్థానాన్ని అలంకరింపదగిన ఈ కవి శతకంలోని పై పద్యాన్ని పరిశీలిస్తే నిందాస్తుతి ప్రధానమైన వ్యాజోక్తిలో కవి ఎంతటి సిద్ధహస్తుడో స్పష్టమగును.

ఆముక్తమాల్యద వంటి ఉత్తమ ప్రబంధ సృష్టికి ఈ స్వామి ప్రోత్సాహమే ప్రధాన కారణం. 'ఆంధ్ర విష్ణువు'గా నారాధింపబడిన శ్రీకాకుళ స్వామికి కాసుల పురుషోత్తమకవి నాటికి ఉత్సవ పూజాదికములడుగంటినవి. ఆలయం జీర్ణస్థితిలో ఉన్నది. కవి ఈ స్థితిని జూడలేక ఉద్రిక్త హృదయుడై దానికి బాధ్యుడు స్వామియే అని గేలి పలిచినాడు. తన ఇంటిని చక్కపెట్టుకొనజాలనివాడు యజమాని కానట్లు తన ఆలయ వైభవాన్ని నిలబెట్టుకోలేని స్వామి శక్తిమంతుడని భావించటం కష్టమే అని పురుషోత్తమకవి అభిప్రాయము. ఆ భావాన్నే కవి వ్యాజోక్తి పూర్వకంగా వ్యక్తీకరించి పౌరుషం వచ్చేటట్లు పరిహాసించినాడు. ఈ సంఘటన అనంతరం ఆలయోద్ధరణము జరిగినది. సంస్థానాధిపతులు స్వామికి నిత్య పూజాదికములు ఉత్సవములు వైభవంగా నిర్వహించటానికి ఏర్పాట్లు చేసినారు. కవితోపాటు భక్తులుకూడ ధన్యులైనారు. పురుషోత్తమ కవి రచన సరస మనోజ్ఞమైంది. వ్యాజోక్తి పూర్వకమైన ధార వాడియై కార్యాన్ని సాధించినది.

పురుషోత్తమ కవి శతకానికి గ్రహించిన మకుటమే చిత్రంగా, సాభిప్రాయ విశేషణ పూర్వకంగా ఉన్నది. దాసరివలె అన్నవస్త్రము లకు పరుల నాసించు దుర్గతి ఎందుకు? దాసులెంత దూరినా ఇసుమంత పంతమున్నదా? అని దూటి సాటిసాములవలె శక్తిని చాటుకొనకుంటే ఉన్నకీర్తి పోతుంది సుమా! అని కవి హెచ్చరించినాడు. 'స్వామికి సహజంగా ఆతనికిగల శక్తివల్ల కీర్తిరాలేదని అది అంతా ఆలుబిడ్డలు దెచ్చిన ఖ్యాతి అనిగేలి చేసినాడు. పౌరుషమున్నవాడికి

ఇంతకంటె మించిన మందలింపు అవసరమా? భూదేవి, సహనము మూర్తీభవించిన గృహిణి. విష్ణువు లోకరక్షకుడు - స్థితికారుడు. లక్ష్మీదేవి సంపన్నురాలు ఆ సంపదతో భక్తులకు కామితార్థములిచ్చిన కీర్తిని వహించినాడు. సముద్రుని కూతురు లక్ష్మికదా! కామితార్థము లొసగునవి సముద్రమునుండియే కదా ఆవిర్భవించినవి!! పెద్ద కుటుంబముగలవాడు. నానా విధములుగ అవతారము లెత్తినవాడని సూచ్యము. కాని దానికి మూలకారకుడు సృష్టికర్తయైన బ్రహ్మయే. ఆతని కుమారునివలన వచ్చిన కీర్తి అది. పని పాటలులేక పాల సముద్రముపై ఆదిశేషువు శయ్యగా శయనించిన విష్ణువు సతీసుతుల కీర్తి సంపదలతో హాయిగా ఉన్నాడని, నిజంగా మొదటినుండి "దామోదరుడే" అని పరిహాసించటంలోని రామణీయకము, వ్యంగ్యము వర్ణనాతీతము. పురుషోత్తమకవి నిందాస్తుతి ప్రతి పద్యంలో ఈ విధంగా నరసమైన నుడికారముతో సాగింది.

మా మొఖిసాకు గ్రామంబు లిమ్మనలేదు
కొంపలు గాల్పింపకూడదంట
కరి హయాదుల మేము కాంక్షింపగా లేదు
గోవధ మాన్పింప బ్రోవుమంట
మాకు మిమ్ములను సామ్రాజ్యమిమ్మన లేదు
క్షితిలోన ప్రజల రక్షింపుమంటి
స్వామి మా కొరకేమి కామింపగాలేదు
క్షితిలోన ప్రజల రక్షింపుమంటి
వెలగి నీ పదసేవలు జేయుమాకు
లేరె కోరిక లేటికి; వెన్నగలుగ
నహహా నేటికి నేతికి సంగలార్చ
వైరిహరసింహ సింహాంద్రి నారసింహ!

పదునెన్మిదవ శతాబ్దిలో వెలువడిన వ్యాజోక్తి, చారిత్రక ప్రాధాన్యంకల శతకాలలో గోగులపాటి కూర్మనాథుని సింహాద్రి నారసింహ శతకానికి అగ్రతాంబూల మీయవలసిందే. ఢిల్లీ సుల్తానుల అధికారులు హైందవ దేవాలయాలను ముట్టడించి తెలుగు దేశములో కాలూని ఇక్కడి పవిత్ర క్షేత్రములనుకూడ విధ్వంస మొనర్చుచుండిరి. ఆ సందర్భాల్లో కవులుద్రిక్తులై ఆవేశపూర్వకంగా క్షేత్రస్వాము లను వ్యాజోక్తులతో తూలనాడిరి. సింహాచలముపై తురకలు దండ యాత్ర చేసిన సందర్భంలో కూర్మనాథ కవి ఎంతో ఆవేదన నొంది 'ఆంధ్ర సృష్టి' నిలుపుమని నారసింహుని బ్రతిమాలి, బెదిరించి, ప్రార్థించినాడు. సాధారణంగా భక్తులు తమ పాపములను హరింపు మనీ, ముక్తినొసగుమని సంసార సాగరమునుండి తరింపజేయుమని కోరటం పరిపాటి. కాని కూర్మనాథ కవి తనకై ఏమీ కోరక ప్రజలను కాపాడుమని కోరటం అతని విశాల హృదయాన్ని, ప్రజల సమస్య లను పరిశీలించే అభ్యుదయ ధర్మాన్ని, సమకాలిక సజీవ సమస్యలను చిత్రించే వాస్తవిక దృక్పథాన్ని నిరూపిస్తున్నాయి. మడిమాన్య ములు, అగ్రహారాలు సామ్రాజ్యములు కోరక ప్రజల రక్షింపుమని పదే పదే కవి కోరినాడు. విదేశీయుల దుండగాదులను చిత్రించి, తెలుగు వారి కొంపలు కూలకుండ కాపాడుమని బ్రతిమిలాడినాడు. గోవధ మాన్పింపుమని ప్రార్థించినాడు. ఇంతకంటే తెలుగు వారికి కావలసింది ఏమి ? అని సరసమైన నుడికారమున శక్తిమంతమైన భాషలో వ్యక్తీకరించినాడు.

తెలుగులో ఇటువంటి శతకాలు అయిదారులున్నాయి. స్వామిని వ్యాజోన్నాలలో గేలిచేసి మహమ్మదీయుల విధ్వంసక కృత్యములను, వారి క్రూరచిత్తోవృత్తిని సజీవంగా చిత్రించుటలో గోగులపాటి కూర్మనాథ కవికంటె రెండాకులు ఎక్కువ చదువు కొన్నవాడు భల్లా పేరయ. నిజాముల కాలమున ధంసా భద్రాచల

ప్రాంతాల్ని అల్లకల్లోలపఱిచిన ఉదంతాల్ని పేరయ కవి భద్రగిరి శతకంలో వ్యాజోక్తులతో వ్యక్తీకరించినాడు. రణరంగంలో వెన్నిచ్చి పరుగెత్తే పిరికివారికి కూడా పౌరుషం కలిగించే విధంగా ఈతని రచన సాగింది. పూర్వము వివిధ అవతారములు దాల్చి క్రూరాతిక్రూరులైన రాక్షసులను సంహరించిన పరాక్రమ మేమూలదాగినదని సూటిగా ప్రశ్నించి తురకల నెదుర్కొనే శక్తి లేకున్నచో ఆయుధాల్ని ఎవరికైనా దానం చేయుమని స్వామిని హెచ్చరించినాడు. ఆ హెచ్చరికలోని చమత్కార్యాన్ని చూడండి.

శంఖంబు కడు బీద జంగంబుచే నున్న
మాదియైనను బొట్టపోసికొనుచు
చక్రంబు కుమ్మరి సరసనుండిన వేడ్క
కుండలైనను జేసికొను రయమున
గద సుకాలీవాని కడనున్న వేవేగ
గోనె పైనము నెత్తుకొను ముదమున
తగనాల్గు చేతులు ధంసాకు గల్గిన
నికనింత రాజ్యంబు నేలు కొనును

స్వామికేల యివి వృధాసరసముగను
వారి వారికి దయసేయు వరుసతోడ
భద్రగిరి వాస శ్రీరామ భద్రదాస
పోష బిరుదాంక రఘుకులాంబధి శశాంక.

శంఖ చక్రాదులు స్వామి ఆయుధాలు. అవి పనికి రానపుడు ఏ జంగమునకో, కుమ్మరికో ఇచ్చినచో పొట్టపోసికొని బ్రతుకుతారని కవి స్వామికి రోషము వచ్చునట్లుగా తూలనాడినాడు. ధంసా నెదుర్కొను శక్తి లేనపుడు భరతాది సహాజన్ములకు పారసీ

చెప్పించుమనీ, ఇంద్రాది దిక్పాలకులకు నమాజులు నేర్పుమనీ, ఆళ్వారులకు సున్నతీలు జేయించుమనీ సూచించి గేలిచేసినాడు. ఆలయ పాత్రలు మద్యపానచషకము లైనవి. దేవాలయ ప్రాంగణములు మాంసపుముక్కలతో అసహ్యాముగా మారిపోయినవి. ప్రతి పద్యమున వారి దుశ్చర్యలు వర్ణించిన విధము వ్యాజోక్తి పూర్ణమైంది. తెలుగుతనము, ఆంధ్ర సృష్టి, ఆంధ్ర సంస్కృతి అంటె కవులకు ఎంత అభిమానమో, ఈ శతకాలు నిరూపిస్తున్నాయి.

చిలుకముక్కునఁ గాటుచెందని బింబంబు
పొగలేక నిల్చు కప్పురపు దివ్వె
కోయిల నొక్కఁగా గోలుకని చివుఱాకు
గాటంబు పచ్చి మరాటి మొగ్గ
తుమ్మెదవ్రాలని కమ్మదామర పూవు
నవకమౌ మేల్దవనంపు మొల్క
సానపై దీరిన జాతి వజ్రపు రవ
వాసించుగోవ జవాది బరణి
వలపుల మిటారి నిత్యము వచ్చుదారి
చూచివేసారి, మనమున సొంపుమీఱి
మగువ నొకసారి చెనయక మరునిబారి
వశమె శ్రీరామరామ లావణ్యసీమ!

శతక వాఙ్మయమున శృంగార శతకములు విశిష్టములైనవి. హాల చక్రవర్తి సంతరించిన గాథా సప్తశతి, అమరుకము, భర్తృహరి శృంగారశతకము, శృంగారప్రబంధములు మున్నగువాటిలోని శృంగార రసపూర్ణములైన భావానుకరణములతో తెలుగులోకొన్ని శృంగార శతకాలు రచింపబడినవి. సంయోగ వియోగ శృంగార

ప్రధానములగు శతకాల సంఖ్యయే బహుళం. వాత్స్యాయనుడు వివరించిన కామకళారహస్యాలను, శ్రీకృష్ణుని శృంగారచేష్టలను, సభ్యాసభ్యముగ కొందఱు చిత్రించినారు. మఱికొందఱు భగ్న ప్రణయాన్ని, దివ్యదాంపత్యమును, మధురాతిమధురంగా శతక రూపంలో వర్ణించినారు.

పురుష విరహ ప్రధానములైన శతకాలలో లావణ్యశతకం ప్రత్యేకముగ పరిశీలింపదగింది. పందొమ్మిదవ శతాబ్దిలో జీవించిన పోలిపెద్ది వేంకటరాయ కవి రచించిన శతకమిది. ఈ కాలమున వెలువడిన శతకాలలో ప్రబంధముల లోని శృంగారానుకరణము అధికముగా నున్నవి. నాయికానాయకుల వర్ణనములందు, సంయోగవియోగ భావ వ్యక్తీకరణమునందు అక్కడక్కడ కొన్ని రమణీయములైన పద్యములున్నవి. అనుకరణ ప్రధానములైనా హృద్యములుగానున్న పద్యములలో లావణ్యసీమలోని శతకపద్యమిది. ఒకానొక నాయకుడు నాయికపై తపించిన యింది సరసముగ వర్ణితము. మిసమిసలాడు యౌవనమున నాయికావర్ణనం కాళిదాసు శాకుంతల నాటకంలోని "అనాఘ్రాతం పుష్పమ్" అను శ్లోకభావానికి అనుకరణ. 'చిలుక కొరికిన పండు తియ్యన' అని తెలుగులో సామెత. చిలుక కందని పండు నిగనిగలాడుచుండు ననుటలో సందేహంలేదు. నవయౌవనం మూర్తీభవించిన నాయిక లావణ్యమును కవి ఉపమాన పరంపరతో వర్ణించినాడు. చిలుక ముక్కున కాటుపొందని దొండపండు, స్వచ్ఛమైన కాంతులు వెద జల్లే కర్పూరకళిక. కోయిల నొక్కని లేచిగురాకు, సుకుమారమైన తుమ్మెదవ్రాలని పద్మము, మొదలగునవి అన్నీ సుపరిచితములైన ఉపమేయములు - రెడ్డిరాజుల కాలమునుండి తెలుగువారి రసికత ప్రణథాదుల కమనీయములైన పద్యాలలో ప్రతిబింబించినది. సుగంధ ద్రవ్యములు - మసాలా దినుసుల వ్యాపారమున కాకలు తీరినవాడు

అవచి తిప్పయశెట్టి ఆతడు సుగంధభాండాగారాధ్యక్షుడు. రసిక రాజులు నెలకొల్పిన పోర్టు ఫోలియో అది. ఈ పద్యమున వర్ణిత మైన నాయిక వలపుల మిటారి. అనురాగ సౌరభమును వలపులో రంగరించి గుబాళించునట్టిది. దవనంపు మొక్క-గాటంబు పచ్చి మరాటిమొగ్గ - అను ప్రయోగాలు ప్రత్యేకంగా గమనింపదగినవి. దవనపు మొక్కకపసిమి మిసిమి గలది. సౌరభమును వెదజల్లి గుండెను ఝల్లనిపించును. మరాట మొగ్గ గాఢమైనది. తాపమును హెచ్చించు మసాలా. ఇవి అన్నీ నూత్నోపమితములు - భావనైశిత్యమునకు దోహదకరములు. ఈ యుగమున వెలువడిన శతకములలో నాయికా విరహ ప్రధానములైన శతకాల సంఖ్య అధికం. పురుష విరహ ప్రధానంగా వ్రాయబడిన శతకాలలో లావణ్యశతకం మనోహర మైందని ఈ పద్యము నిరూపిస్తున్నది.

దూతకావ్యాల వలె శృంగార ప్రధానంగా అనుకరణ రూపమున శ్రీకృష్ణుడు, రాధ, గోపికలు ఆలంబముగా రచింపబడిన శతకాలలో కీరవాణి, కాంతాలలామ, మోహినీ, కలువాయి, తాడి మళ్ల రాజగోపాల శతకాదులు ఇరవైకి మించినవి. చౌశీలుబంధము లను, కామకళారహస్యములను, రతిక్రీడలను విశృంఖలముగా వర్ణించిన శతకాలలో గోపీనాథము వేంకటకవి బ్రహ్మానందశతకం ప్రధానమైంది. పార్వతీపరమేశ్వరుల నాలంబముగ గ్రహించికొందఱు మల్లికార్జున, రాజలింగశతకములు రచించినారు. ఒక్కొక్కపద్యంలో ఒక్కొక్క బూతు నుదాహరించి శ్రీకృష్ణుని శృంగారక్రీడలను పచ్చిబూతులతో వర్ణించిన శతకము సరసోక్తియుక్త కృష్ణశతకం. స్వచ్ఛమైన శృంగార వర్ణనలకు 'శృంగార శతకాన్ని' భగ్నప్రణయ మును చిత్రించిన 'మనోరమ' శతకాన్ని తార్కాణముగా గ్రహించ వచ్చు.

గంగగోవు పాలు గంటెడైన నను జాలు
గడవడైననేమి ఖరము పాలు
భక్తిగలుగు కూడు పట్టెడైనను చాలు
విశ్వదాభిరామ వినురవేమ.

వేమనకు సంబంధించిన ప్రతిసమస్యనుగూర్చి వాదోపవాదాలు చెలరేగినవి. అతని కులము, కాలము, వంశము - వ్యక్తిత్వము, పుట్టి నిల్లు, మొదలగువానినిగూర్చి పండిత పరిశోధకులు చర్చలు, వాగ్వా దము లనేకంగా కొనసాగించినారు. వేమన లెందరో ఉన్నారు. అసలు వేమన ఎవరనీ, అతడు స్వయంగా రచించిన పద్యాలెన్ని ? అని విమర్శకులు తర్జనభర్జనలిప్పటికీ చేస్తున్నారు. ఎన్నెన్ని అభి ప్రాయ భేదాలు కలిసినా కట్టుకథలు ప్రచారానికి వచ్చినా నాలు గైదు విశేషాల్లో దాదాపు ఏకీభావం కుదిరిందని భావింపవచ్చు. అతడు పదునేడవశతాబ్దిలో జీవించినాడు. కాపు కులాన పుట్టినాడు. తిండికి తిప్పలు పడిన కుటుంబం కాదు ఆయనది. చదువు సంధ్యల గూర్చి పట్టించుకొనకున్నా సామాన్య భాషా జ్ఞానం సంపాదించు కున్నాడు. పీఠి కాగలు పాండిత్యం కంటె, గురుముఖంగా చదువు కొని గడించిన విద్యలకంటె నిశితమైన లోక పరిశీలనవలన సంపాదిం చిన జ్ఞానమే అతని విజ్ఞాన ధనం. అతనిని కవిగా గుర్తించలేదు. ఇటీవలనే అతడికి పట్టము కట్టినారనుటలో కొంచెము అతిశయోక్తి స్ఫురిస్తున్నది. ఒక కాలంలోనే బహుళ ప్రచారానికి నోచుకున్న పద్య రచన చేసినాడు. శిష్యవర్గం అనుచరవర్గం ఏర్పడింది. పిల్లవేమనలు కొల్లలుగా అవతరించినారు. విశృంఖలవిహారి, స్వేచ్ఛాప్రియుడు. ఒకరి అదుపుతో పెరిగినవాడుకాదు. రసికుడు. వేశ్యాలోలుడు. జీవితసుఖాన్ని తృప్తితీర అనుభవించినాడు. లోకం లోని అన్ని రంగాలను ప్రత్యక్షంగా పరిశీలించినాడు. ప్రతి హృదయంలోని అగాధ సముద్రాన్ని తరచి చూచినాడు. రత్నాలవంటి భావాల్ని

రాసులుగా తన హృదయంలో దాచుకొన్నాడు. సమయసందర్భం వచ్చినప్పుడొక్కొక్క రత్నాన్ని పద్యంలో పొదిగినాడు. విన్నన్న చెప్పిందే వేదం అని లోకోక్తి. కాని వేమన చెప్పిందే వేదం. తమిళులు 'కురల్' ను వేదతుల్యంగా గౌరవిస్తారట. మనకు వేమన పద్యాలటువంటివి. అతడెన్ని పద్యాలు చెప్పినాడన్నది తీరని సమస్య. వేమనకే జ్ఞాపకంలేనప్పుడు మనమావిషయంలో స్పష్టంగా చెప్పలేము. అయిదారువేల వరకు సంకలనం చేసి వేమన పద్యాలని ప్రకటించినవాడికి, వేమన తత్త్వాన్ని గుర్తించి జల్లెడపట్టితే మిగిలిన పద్యాలే వేమన్నవి. అటువంటి జల్లెడను తెలుగు కవులు, పండితులు, విమర్శకులు, చారిత్రకులు, పరిశోధకులు, ఒకనాటికైనా రూపొందించటం ఎంతో అవసరం. వేమన వ్రాసినవి పద్యాలేకాని శతకమని అతడు చెప్పుకోలేదు. ప్రకటన కర్తలు వేమన శతకం అంటున్నారు. నామమాత్రమైన కొన్ని శతకాలకంటె అసలైన శతకం వేమన్నదే. వీనిలో శతక లక్షణాలు అన్నీ ఉన్నాయి. ఒక్క సంఖ్యా నియమం తప్ప! వేమన్న కేవలము సంప్రదాయాన్ని పాటించి పద్యరచన చేసిఉంటే సంఖ్యా నియమాన్ని కూడా అనుసరించేవాడు. కందం, సీసము, వృత్తం, ఎన్నో విధములైన పద్యాలు చెప్పగా చెప్పగా చివరికి మిగిలింది ఆటవెలది. అటు సంసారంలోను, ఇటు సాహిత్యంలోను వేమనను వరించింది - వలచి మురిపించింది ఈ ఆటవెలదియే. మన హృదయాన్ని అలరింపజేసిన వేమన ఆటవెలది అక్షర రూపంలో ప్రత్యక్షమైంది. కాని వేమన హృదయాన్ని అంతగా ఆకర్షించిన 'ఆటవెలది' ఎవతెయో. ఆమెదే ఊరో ఏమి పేరో తెలియదు. తాళి కట్టిన భార్యకంటె ఆరాధ్య దైవంగా ఆమెను మన్నించిన రసికుడు వేమన. వేమన రచనలో ఒక విశేషాన్ని ప్రత్యేకంగా గమనించ వలసి ఉన్నది. కవులు సాధారణంగా చాటు పద్యమో, లఘు కృతియో, మహాకావ్యమో రచించటానికి పూనుకుంటే నియమిత

కాలంతో పూర్తి చేస్తారు. వేమన కలం పట్టిన నాటినుండి కొన ఊపిరితో ఉన్నంత వరకు పద్యాలు ఆశువుగా చెప్పినాడు. మౌనముద్ర దాల్చి సమాధి అవస్థలో ఉన్నా అతని హృదయంలో నుండి ఉబికి వచ్చే భావాలను శిష్యులు గ్రహించి వాటికి అక్షర రూపమిచ్చి ఉంటారు. వేమన కంటె లౌకిక జ్ఞానం కల పండితులు కవులు ఎందరో ఉంటారు. ప్రతిభా వ్యుత్పత్తులు కల మహాకవులకు కరవు లేదు. కాని లౌకిక జ్ఞానమును, స్వానుభవములను కవితావస్తువుగా స్వీకరించినవారిలో వేమనదే అగ్రస్థానం. మానవుడికి శైశవ, బాల్య, కౌమార, యౌవన, ప్రౌఢ, వార్థక్య దశలున్నట్లు అతని పద్యాలకు అన్ని అవస్థలున్నాయి. అతని పద్యాలనీ దృష్టితో సంకలనంచేస్తే అతని మానసిక పరిణామ వికాసాలను చక్కగా పరిశీలించి వ్యక్తీకరించవచ్చు. జాను తెనుగు అల్పాక్షరముల ననల్పార్థ రచన - అని ప్రాచీన కవులెందరో ప్రతిజ్ఞలు చేసినారు. ఆచరణ రూపమున ఆ గుణములు కనిపించవు. వేమన ఏ ప్రతిజ్ఞ చేయలేదు. అచ్చమైన తెలుగుభాష, నుడికారం, ఎటువంటిదో తెలిపి దాని రుచిచూపిన వాడు వేమనయే. కావ్య ప్రబంధములనే బంగారు పంజరం నుండి బయటపడి స్వేచ్ఛగా విహరించిన సహజ ధోరణిలో హాయిగా పలుక నేర్చిన చిలుక వేమన చేతిలో ప్రాలింది. ఆ చిలుక పలుకులే ఈ పద్యంలోని మాటలు.

ఈ పద్యానికి అర్థాన్ని వివరించటం తెలుగువారికి "ఆ ఆ"లు నేర్పటమే అవుతుంది. ఆటవెలదిలోని చివరి పాదం పూర్తిగా మకుటమే. మిగిలినవి మూడు పాదాలు. ఏ గణమున కా గణము-యతి ప్రాసలు—ఎవరో పీటలు వేసినట్లే - వచ్చి తమతమ స్థానాల్లో ఒదిగినాయి. నిత్య సత్యాలతో, ఉదాత్త గంభీర భావాలతో సరసోక్తులతో, తీయని మాటలతో, సహజమైన లోకోక్తులతో సరసాలాడింది

వేమన అటవెలది. ఆమె-ఆయన-పలుకే-బంగారమైంది. అతనికిగల లోకానుభవమెట్టిదో చూడండి.

చెప్పులోని రాయి చెవిలోని జోరీగ
కంటిలోని నలుసు కాలి ముల్లు
ఇంటిలోని పోరు ఇంతింత గాదయా
విశ్వదాభిరామ వినుర వేమ.

మాన్యంబులీయ సమర్థుఁడొక్కఁడులేఁడు
మాన్యముల్చెఱుప సామంతు లంద
ఱండిన యూళ్ళగో డెఱిగింపఁడెవ్వఁడుఁ
బండిన యూళ్లెన్న ప్రౌఢులంద
ఱితఁడు వేద యటంచు నెఱిఁగింపఁడెవ్వఁడు
గలవాని సిరి యెంచగఁగలరు చాల
తనయాలి చీకటి తప్పెన్నఁ డెవ్వఁడుఁ
బెఱకాంత అంకెన్నఁ బెద్దలంద

ఱిట్టి దుష్టుల కధికార మిచ్చినట్టి
రాజుననవలెఁగాక దుర్నయుల ననఁగ
నేమి పని యున్నయది సత్కవీంద్రులకును
రామలింగేశ రామచంద్ర పురవాస.

పదునెన్మిదో శతాబ్దిలో జీవించిన అడిదము సూరకవి రామలింగేశ శతకంలోని పద్యమిది. అధిక్షేప శతకాలలో శతక కర్తల ధోరణి కటువుగను, వాడిబాణములవలె గుండెను చీల్చుకొని పోవునట్టుగను నుండును. సూరకవి లేఖిని కూడ నిశితమైంది. ఆనాటి పరిస్థితులు కూడ కవులను తీవ్రవాదులగుటకు దారితీసినవని భావింప

వచ్చు - బలమైన కేంద్ర ప్రభుత్వములేదు. దేశము చిన్నచిన్న జమీం దారీలలో చీలిపోయింది. ప్రభువులు కొందరు నిరంకుశులైనారు. అసమర్థులైన నరేంద్రుల పాలనలో దుర్వినీతులగు అధికారుల దుండగములు మితిమీరి పోయినవి. ఆర్థిక పరిస్థితి దెబ్బతిన్నది. పన్నుల భారమధికమైంది. ధనికులకు దరిద్రులకు అంతరమధికమైంది. పరదూషణమే కొందరికి నిత్యవృత్తిగా మారింది. రాజులలో రసికత సన్నగిలింది. కవులకు, కళాకారులకు, పండితులకు, ప్రభాపోషణము క్రమముగా అంతరించుచున్న కాలమది. సామాన్య ప్రజలస్థితి దుర్భరంగా ఉన్న ఆ యుగంలో కవులు రచించిన అధిక్షేప శతకాలలో సంఘములోని ప్రతిరంగముతో ప్రవేశించిన అవినీతిధోరణి, మానవుల మనఃప్రవృత్తిలో వచ్చిన మార్పులు ప్రతిబింబించినవి.

అడిదము వారు కత్తిని కలమును చేబట్టినవారు. అడిదము సూరకవి శాపానుగ్రహశక్తి యుక్తుడు. రామలింగేశుని భక్తుడు. సమకాలిక పరిస్థితులకు కలియుగ ప్రభావమే కారణమని కొందరు భావించినారు. కాని సూరకవి అధికారుల దుర్నయము దీనికి బీజమనీ, అసలు తప్పు అటువంటి అధికారులను నియమించిన సామంతులదనీ నిర్భయముగా చాటినాడు. వారు శక్తివిహీనులని విమర్శించినాడు. భూసురులకు అగ్రహారములొసగు శక్తిలేదుకాని మాన్యములు హరించుటకు సామాన్య ప్రభుత్యోగికూడ సమర్థుడే, అధికారుల దేశమున సంచరించి పరిస్థితుల సమీక్షించి పంటలులేని ప్రాంతముల దుస్థితిని ప్రభువులకు విన్నవించక, పండిన ఊళ్ళలో ప్రవేశించి మితిమీరిన పన్నులు వసూలుచేయటము వారి దినచర్యగా మారింది. నిరుపేదను చూచేవాడులేడు. చూచినను పలుకరించి దయదాల్చి సహాయము చేసినవాడులేడు. మానవుల చిత్తవృత్తి మారింది. తమ తప్పులెఱుగరుకాని అన్యులదోషముల నెన్నుటలో మొనగాండ్రు. సంస్థానములోని అధికారుల పాలనను తూర్పారబట్టిన విధమిట్టిది.

సూరన రోషావేశపరుడై "దుష్టులను విమర్శించి మాత్రమేమి లాభము. ఈ దుష్టులకటువంటి అధికారము నొసగిన సామంతునిదే తప్పు" అని ప్రభువుల భోగలాలసతను, అసమర్థను రచ్చకీడ్చినాడు. సూరకవి అధిక్షేప విధానము సూదిపోటువలె, సునిశితమై నిప్పువంటి చుఱుకులు పెట్టునట్టిదని ఈ పద్యంవలన స్పష్టముగా గ్రహించినారు కదా!

గౌతమీ స్నానానఁ గడదేరుదామంటె
మొనసి చన్నీళ్ళలో మునుగలేను
తీర్థయాత్రలచేఁ గృతార్థు లౌదామంటె
బడలి నేమంబులే నడపలేను
దానధర్మముల సద్గతిని జెందుదమంటె
ఘనముగా నా వద్ద ధనము లేదు
తపమాచరించి సార్థకము నొందుదమంటె
నిముషమైన మనస్సు నిలుపలేను

గష్టములకోర్వ నా చేతఁగాదు నిన్ను
స్మరణ చేసెద నా యథా శక్తి కొలఁది
భూషణ వికాస శ్రీ ధర్మపురనివాస
దుష్ట సంహార నరసింహా దురితదూర!

తెలుగువారికి సుపరిచితమైన శతకాలలో తెలంగాణమునందు కరీంనగరము మండలమున గల ధర్మపురి క్షేత్ర దైవముపై రచింపబడిన ధర్మపురి నరసింహ శతక మొకటి. శేషప్పకవి ఈ శతకాన్ని వ్రాసినాడు. ఈతడు పండితుడు కాడు. పూర్వ కవి శతకములను క్షుణ్ణముగా పఠించి వారి భావములను శైలీ విధానమును జీర్ణించు

కొన్నవాడు కనుక ఆ ధోరణిలో తనకు పరిచితమైన భాషలో నృకేసరి, నరసింహ శతకములను వ్రాసినాడు. శేషప్ప కవి అతి సామాన్యమైన జీవితమును గడిపినవాడు. పొట్టకూటికి తపించినా, ఆత్మాభిమానము వీడి అన్యుల నాశ్రయించక తన ఇష్టదైవమగు నరసింహస్వామిని భజించి కాలము వెళ్ళబుచ్చినాడు. భక్తి శతక కర్తలందరును తమ స్థితిని ఆత్మనివేదన పూర్వకముగ విన్నవించి ముక్తికై దైవము నర్థించియుండిరి. శేషప్ప ఆ ధోరణిలోనే తన అజ్ఞానమును అశక్తతను చాటినాడు. కల్లకపటమెరుగని మనసు వుండి నిశ్చలభక్తిపారవశ్యమును రంగరించుకొని దొరలిన మాటలివి. నరసింహస్వామిని తండ్రిగా భావించి శేషప్పకవి ఎంతో ఆత్మీయతతో తనస్థితిని తెలిపినాడు. గౌతమలో స్నానము చేద్దామంటే చన్నీళ్ళలో మునిగేశక్తి శరీరానికి లేదనియు, తీర్థయాత్రలకై నియమమును వహించలేనని, దానధర్మములుచేసి పుణ్యమునొందుటకు ధనములేదని తపమొనర్చుటకు గలశక్తి, కష్టములను సహించు ఓపిక లేదని దాపరికములేక స్వామికి నివేదించినాడు. శక్తికొలది నామ స్మరణ చేసెదనని మాత్రమే స్పష్టమొనర్చినాడు. భక్తిలక్షణములలో రామకీర్తన మొకటి. స్వచ్ఛమైన మనసుతో రామకీర్తన మొనర్చి నాడు. భావములోవలె అతని భాషకూడ స్వచ్ఛమైన రీతిగా మాండలికరూపాన్ని సంతరించుకొన్నది. తనకు వచ్చిన భాషలో శతకము వ్రాసి శతకకవుల శ్రేణిలో విశిష్ట పాత్ర నలంకరించుటలోనే అతని గొప్పతనము వ్యక్తమైనది.

అమ్మకు రెండబ్బకు రెం
డిమ్మహిఁదెట్టించు కూతురెందుకు ధర నా
ద్రిమ్మరి పుట్టుకపోయిన
నిమ్మళమని యండ్రు జనులు నిజము కుమారీ !

పుస్తకాల షాపుకువెళ్ళి ఏమైనా శతకాలున్నాయా అని అడిగితే యజమాని లేక అతని నవుకరు "వేమనశతకం కుమారీశతకం కుమారశతకం - కృష్ణశతకం." అని పారంపల్లించినట్లే పదిశతకాల పేర్లు గడగడ చెప్పేస్తాడు. పందొమ్మిదో శతాబ్దిలో జీవించిన పక్కి వేంకటనరసయ్య రచించిన కుమారీకుమారి శతకాలు తెలుగునాట అంతట ప్రచారాన్ని పొందినవి. ఇప్పటికి ఎన్ని వేల ప్రతులు ఎవరెవరు ముద్రించినారో లెక్కతేలని శతకాలివి. అవి తెలుగు వారి కన్న బిడ్డలు - వారికుద్దేశించిన నీతిశతకాలు. బాలబాలికలకు కంఠస్థమగురీతిలో వారికి చద్దిమూటలుగా పనికివచ్చే నీతి పద్యాలు. జీవితంలోని అన్నిదశలకు, అన్ని రంగాలకు చెందిన వివిధ విషయాలపై బాలబాలికల హృదయాలలో చెఱగని ముద్రవేసిన శతకాలివి. సత్ప్రవర్తనకు నయమార్గోపదేశానికి విజ్ఞానసర్వస్వంవంటి గ్రంధాలు. తలిదండ్రులకు, పుట్టినింటికి కీర్తిప్రతిష్టలు తెచ్చే కూతురే కూతురు. "అయ్యకు అబ్బకు రెండు తిట్లు తిట్టించే కూతురు పుట్టకపోయినా నిమ్మళంగా ఉండేది" అని అనుకునే భావమే పద్యమై అవతరించింది. దీనిమార్గంలో నడచిన నీతి శతకాలు వందలకొద్ది ఉన్నవి. నీతి శతకాల్లో ఈ పద్యాలకెంత ప్రాధాన్యమేర్పడిందో కృష్ణశతకంలోని పద్యాలకు అంతేప్రాచుర్యం లభించింది.

> నీవేతల్లివి తండ్రివి
> నీవేతోడునీడ నీవేసఖుడా
> నీవే గురుడవు దైవము
> నీవే నా పతియు గతియు నిజముగఁ గృష్ణా

తెలుగు అక్షరజ్ఞానం కలవానినోట నలిగిన పద్యాలివి. పదము నుడికారము, శైలి, రచనావిధానము - పద్యపునడక, ఒకటికొకటి పోటీపడే శతకాలివి.

వెడవెడనింక భోజనపువేళగతించిన బిడ్డఁడే మొకో
బడి విడిరాఁడు నేఁడనుచు, బాతరలాడుచునుండు నంతలోఁ
గడఁజనుదేర నెత్తుకొని కౌగిటఁజేరిచి నుంచు దువ్వి మై
బడలిక దీఱ సంతసిలు భామిని తల్లినిబోల రెవ్వరున్.

మాతాపితరులు పరమాత్మస్వరూపులు - భగవంతుడు ప్రతి ఇంట వసించుట కుదరదని తల్లి రూపములో అవతరించినాడని ఒకానొక సామెత. తలిదండ్రులు మొదలగు పెద్దవారు ఇంటినుండ అది భగవంతుని ఆశ్రయము లభించినంత భాగ్యముతో సమానమని ఉర్దూ భాష ఒక లోకోక్తి, "మాతృదేవోభవ - పితృదేవోభవ" అని సూక్తి. ఇవి అన్నియు వారు దేవతాస్వరూపులనీ నిరూస్తున్నవి. తెలుగు శతక కర్తలీ సత్యాన్ని ఇతరభక్తి శతకములతోపాటు మాతృమూర్తి నుద్దేశించికూడ శతకాలు రచించి చాటినారు. ఇట్టివి రెండు మూడు వెలువడినవి. అప్పావు మొదలి వ్రాసిన మాతృశతకంలోని పద్యమిది. పిల్లవాడు బడికిపోయి సమయానికి ఇంటికి రానిచో ఆమె తహతహలాడును. ఆలు ధనముజూచు తల్లి కడుపుజూచునని అంటారు. బిడ్డ డాకలి గొన్నచో ఆమెపొందు ఆవేదన వర్ణనాతీతం. ఈ అవస్థ మాతృశతకంలోని పద్యంలో ఎంత హృద్యంగా చిత్రింపబడినదో గమనించండి. భోజనపువేళ దాటిపోయింది. ఇంకా బడినుండి రాలేదు అని ఎదిరిచూస్తుండగానే ఆతడు గబగబ ఇల్లుచేరినాడు. తల్లికి పెన్నిధి లభించినంత సుఖము - తృప్తి. ఎత్తుకొని హృదయానికి హత్తుకొని మై నిమురుటతో పిల్లవాని శ్రమఅంతా క్షణంలో హరించింది. ఉల్లాసంగా తిరుగుతున్న బిడ్డనుజూచి తల్లి పట్టరాని ఆనందంతో ఉంటుంది. అది వ్యక్తావ్యక్తముగా ఉంటుంది. ఆ సంతోష పారవశ్యాన్ని ఎవరునూ పూర్తిగ గ్రహించలేరు. అది ఆమెకే అనుభవయోగ్యము - అపారమైన ఆనంద సముద్రంలో ఉవ్వెత్తుగా చిందులాడే తరంగ

సహస్రాలలో ఒక అంశం ఛాయామాత్రంగా మాత్రమే తల్లి ముఖారవిందంలో ప్రతిబింబిస్తుంది. దివ్యశక్తులతో తేజరిల్లే దేవీ స్వరూపిణి తల్లినిబోలు వారి ప్రపంచమున ఎవరూలేరని అప్పావు మొదలి వచించిన దానిలో ప్రత్యక్షరము సత్యపూర్ణము.

రామా! రావణు తోడవచ్చి కడుజిత్రంబైన రూపంబుతో
నా మారీచుడు మాయచేయఁగని సంహారంబు గావించి తీ
వామాడ్కిన్ నను మోసపుచ్చు నృపముఖ్యామాత్యునారాయణ
స్వామిన్ దొల్తవధించి, తోడనె నృపున్ శార్దూలమై చంపుమా!

అధిక్షేప శతకాలు నానారకాలు. తిట్టు కవితతో కూడినట్టివి వ్యక్తిదూషణ ప్రధానములైనవి వీనిలో విశిష్టములైనవి. కవులు కొందరు శాపానుగ్రహశక్తియుక్తులు - వారిలో ఆద్యుడు వేములవాడ భీమకవి. వ్యక్తి దూషణాత్మకమైన శతకాలు సంస్కృత భాషలోను కొన్ని రచింపబడినవి. కుట్టికవి బిరుదాంచితుడైన వాంఛేశ్వరుని మహిష శతకమిట్టిది. ఈ ఒరవడిలో రచింపబడింది విక్కిరాల రంగాచార్యుల శార్దూలశతకము. పందొమ్మిదో శతాబ్ది పూర్వార్థంలో జీవించిన రంగాచార్యులు ప్రభుత్వమునకు శిస్తు సక్రమముగా చెల్లించలేదు. వేంకటగిరి ప్రభువు, వారి అమాత్యుడు నారాయణస్వామి తన అగ్రహారమును కాజేసిరని అగ్రహమున వారి నీ శతకరూపమున దూషించుట రంగాచార్య కవి చిత్తవృత్తికి కళంకాన్ని కలిగించింది. కవి తన తప్పును కప్పిపుచ్చి రాజును, అధికారులను తూలనాడుట సమంజసముగాలేదని విమర్శకుల అభిప్రాయం. రంగాచార్య కవి "తిట్టు కవిత" శతకరూపమున వెలువడినందున శతకవాఙ్మయమునగల వివిధశతకముల స్వరూపమెట్టిదో పాఠకులు గ్రహించవచ్చు. రంగాచార్య కవి ఒక్కొక్క పద్యమున ఒక్కొక్క దైవమును స్తుతించి, శార్దూలరూపమున వచ్చి తనకు

'అపకార మొనర్చిన రాజును, మంత్రిని సంహరింపుమని కోరుట ఈ శతకమున గమనింపదగినది. ఈ పద్యంలో కవి శ్రీరాముని పరాక్రమాదులను వర్ణించి మారీచాది రాక్షసుల మాయలను రూపుమాపినట్లు తనను మోసగించిన అమాత్యశేఖరుడగు నారాయణామాత్యుని, అతనితోపాటు రాజును సంహరింపుమని కోరినాడు. శతకపద్యములలో కవి తానొనర్చిన దోషము లేదనియు, అమాత్యుడు రాజాజ్ఞ చేతనే అగ్రహారమును హరించెనని తూలనాడెను. అగ్రహారమును ప్రభుత్వము వారు స్వాధీన మొనర్చుకొనుటకు రంగాచార్యులు శిస్తు సరిగ చెల్లింపక పోవుటయే ప్రధానకారణమని కొందఱి అభిప్రాయము. అసలు తప్పు ఎవరిదో దేవుడెరుగును!!

ప్రతి సంవత్సరమునఁ దప్పక సేయు చొప్పున
శ్రీరంగరాయ ధాత్రీధవుండు
పచరించు గుత్తపుఁ బందెముల్గనఁ బోయి
వచ్చునప్పుడు రథభ్రంశ మొంది
నేలపై దూల, డాకాలు, డాకేలును,
గీలునుండి తొలంగి డీలువడుచు
రా, విరోధి శరచ్ఛరన్నవరాత్రాది
దినమాది మరణవేదనను బొంది
తదఘశాంతికై( దై ?)పదేంద్ర గురుచరిత
మైదు నూర్ల నల్బది నాలుగడుగులు గల
వృత్త మిరువది నాళ్ళ కర్పింపలేదె
హరిహరేశ్వర దేవ మహానుభావ.

శతకపద్యములు ముక్తకలక్షణోపేతములు. ఏ పద్యమునకా పద్యము స్వతంత్రమైంది. తరువాతి పద్యముతో నన్వయము

నపేక్షించదు. తెలుగులో కథాత్మక శాఖ వికాసమునొందుటతో ఈ లక్షణము కొద్దిగా సడలింది. కథలో ఏకసూత్రత ఉంటుంది. శతక కర్తలు ఇతిహాస పురాణగాథలనే కాక జీవితకథలను కూడ శతకరూపమున గూర్చినారు. ఈ శాఖలో విశిష్టమైంది ఆత్మకథాత్మక శతకము. తెలుగులో మొదటి ఆత్మకథ పద్యరూపముననను, అందును శతకరూపమున వెలువడుట ఆంధ్రశతక వాఙ్మయ వైశిష్ట్యమును చాటుతున్నది. ఇట్టి శతకమును రచించిన కీర్తిగౌరవములు సుప్రసిద్ధ కవి పండితులగు మండపాక పార్వతీశ్వర కవికి లభించినవి. పందొమ్మిదవ శతాబ్దిలోని మహాకవులలో వీరికి ప్రత్యేక స్థానము కలదు. శతాధిక గ్రంథకర్తలు.

పార్వతీశ్వర శాస్త్రిగారు ఆత్మకథను దినచర్యారూపమున సంవత్సర, మాస, వార, తిథినక్షత్ర రూపమున క్రమరీతిలో వివరించుట, సాహిత్యజీవితాన్ని ప్రధానంగ చిత్రించి సందర్భానుసారముగ జీవితములోని ఇతర విశేషములను తమ వ్యక్తిత్వమును చిత్రించుట ఈ ఆత్మకథలోని ప్రధాన లక్షణము. శాస్త్రిగారి సాహిత్య కృషి పన్నెండవయేట అరంభమైంది. ఈ శతకాన్ని వారు తమ అరువది రెండవ సంవత్సరమున వ్రాసినారు. మండపాక వారిది విద్వత్కుటుంబము. పార్వతీశ్వర శాస్త్రిగారు సంస్కృతాంధ్రభాషా సాహిత్యములందు నిష్ణాతులు - బహుముఖ పాండిత్యసంపన్నులు, వరప్రసాదులు - అపారమైన లౌకిక పరిజ్ఞానము కలవారు. ఏక, ద్విప్రాస నియమమున, చిత్రగర్భకవితారూపమున వీరు రచించిన శతకము లనేకములు ఆంధ్రశతకవాఙ్మయమున కలంకారము చేకూర్చినవి. ద్వ్యర్థి శతకములలో సీతారామద్వ్యర్థి శతకము. వివిధ భక్తిశతకములలో చిత్రకథా సూచన గణపతి శతకము, ఉపాలంభన సర్వేశ్వర శతకము, భక్తి, శక్తి యుక్తి, బీజాక్షర శతకములు మున్నగునవి ప్రత్యేకంగా గ్రహింపదగినవి.

హరిహరేశ్వర శతకంలో వీరి సాహిత్య జీవితమంతయు క్రమంగా వివరింపబడింది. సంస్థానాధీశ్వరులతో వీరు సకుటుంబముగా దేశాటన మొనర్చినారు. ప్రభువుతో ఇష్టాగోష్ఠి సలుపుట, వారితో పాటు గుఱ్ఱపు పందెములను జూచుటకు వెళ్ళిన సందర్భమున జరిగిన సంఘటన ఈ పద్యములో ప్రస్తావించబడింది. పందెములు చూచి తిరిగి వచ్చునపుడు రథము నేలపై తూలింది. చేతికి కాలుకు దెబ్బలు తగిలినవి. కీళ్ళు సడలినవి. దుర్భరమైన బాధనుండి విముక్తినొందుటకు శాస్త్రిగారు ఇరువది దినములలో సుదీర్ఘ కృత్తములతో నొక కావ్యమును రచించినారని ఈ పద్యంలో తెలిపినారు. వీరు వాగ్వాదినీ మంత్ర ప్రభావమున తమ కవితాశక్తిని నానావిధములుగ చాటినారు. ఈ శతకమునందలి ప్రతి పద్యంలో మండపాక పార్వతీశ్వర శాస్త్రి గారు తమ జీవితమునందలి ప్రధాన ఘట్టములను గ్రంథ రచనా విశేషములను వెల్లడించినారు. తెలుగులో శతక పద్యరూపమున ఆత్మ కథను రచించిన వారిలో మహా మహోపాధ్యాయ బిరుదాంచితులగు కొక్కొండ వేంకటరత్నముగారు కూడ ఈ సందర్భమున పేర్కొనదగిన వారు. వీరు ఆత్మకథను బిల్వేశ్వర శతకరూపమున సంతరించినారు. జీవితంలోని ఒకటి రెండు సంఘటనలను, సన్నివేశములను, ప్రధానంగా చిత్రించి శతకములు రచించినవారును గలరు. తిరుపతి కవులు, వావిలి కొలను సుబ్బరాయ కవివంటి వారిట్టి శతకములను రచించినారు.

1. బంగరు లేడి వెండి జనవద్దు నిశాచర మాయగాని యీ
   భంగిది లోకమందు గనుపట్ట దటంచును నేను దెల్ప నీ
   వంగన వేడెనంచు ముదమంది జనంబున దాని వెంబడిన్
   జంగున దాటి పోవుటది సాహసమౌగద రామ! రాఘవా!

2. రమణికి వాంఛితమ్ము లనురాగముతో డుద దీర్పదేని తా
   రమణుడు గాడుసుమ్ము వెనురాడుసుడాతడు గాన జానకిన్

విమల మనస్కు(జేయుటకు వేడుకమై వెసలేడి బట్టగా
సమయము సేసిపోయితిని జక్కగ నిన్నటు నిల్పి లక్ష్మణా!

వస్తు విన్యాసంలో నవ్యమార్గాన్ని అనుసరించిన శతకం దేవులపల్లి సీతారామశాస్త్రి 1921 లో రచించిన రామలక్ష్మణ ప్రశ్నోత్తర శతకము. కొన్ని సందర్భాల్లో శ్రీరాముని వర్తనము పాఠకులకు సందేహం కలిగించే విధంగా ఉన్నది. రామాయణం చదివే టప్పుడు సామాన్యంగా కలిగే సందేహాలను కొన్నింటి నుదాహరించి వానికి శాస్త్రిగారు సమాధానాలు వివరించినారు.

శ్రీరాముడు పట్టాభిషిక్తుడై తీరికగా ఉన్న సమయంలో లక్ష్మణుడు తనకు అన్నగారి ప్రవర్తనము గూర్చి గలిగిన సందేహాన్ని అడిగినట్లు, శ్రీరాముడు సముచిత రీతిలో సమాధానమిచ్చినట్లు వివరించటం ఈ శతకంలోని వస్తువు. "బాల్యమాది తమ సల్పిన యా పనులెల్ల మంచివే, యని యనుకొందుగాని కలవందుల గొన్నిటి సంశయంబు, లీవనుమతి సేయతెల్పెద''—అని లక్ష్మణుడు వినయ పూర్వకంగా అగ్రజునకు విన్నవించినాడు. శ్రీరాముడు ఓపికతో విని అందలి అంతర్యమును స్పష్టమొనర్చినాడు. ప్రపంచంలో బంగారు లేడి ఎక్కడైనా ఉంటుందా? అని ఆలోచించకుండా అది రాక్షస మాయ అయి ఉంటుందని గ్రహించకుండా సీతమ్మ కోరి నంతనే గంతులు వేసుకుంటూ లేడిని వెంటాడటం సాహసంకాదా? అని లక్ష్మణుడు సూటిగా ప్రశ్నించినాడు. రమణి కోరిక దీర్చటం రమణుని ప్రథమ కర్తవ్యమని, ఆ మాత్రం చేయజాలనివాడు రాక్షసుడని రాముని అభిప్రాయం. రామునివంటి అవతారమూర్తికి అది లీలా మాత్రమైన కార్యమే. "నిన్ను నిల్పిపోతిగదా నీవు నా సూచన మన్నించి ఆశ్రమ ప్రాంగణాన్ని వీడకుండా ఉంటే ఏ ఆపద వచ్చి ఉండేదికాదు అని మెత్తగా మందలించి రాముడాతని

నోరు మూసినాడు. ఈ శతక రచన ఒక పద్యం ప్రశ్నరూపంలో, ఇంకో పద్యం సమాధానరూపంలో సాగింది. ఈ ఒక్క ప్రశ్నకు రాముడిచ్చిన సమాధాన్నాని చదివి మీరే ఆలోచించండి. అసలు తప్పెవరిది? రామునిదా! లక్ష్మణునిదా ?.

ధర నాసూరి కులేశ కేశవ సుపుత్ర ఖ్యాతిఁజెన్నొంది శా
స్త్రరుచిన్ యాదమనంద నుండ నతడున్ ఛాందోగ్య
వాక్యార్థమే
మరి హీనోప జెప్పఁగాదని సమర్మ శ్రుత్యుపాత్తార్థముల్
కరమొప్పన్ రచియించితే తిరువరంగస్థాయి రామానుజా.

రామానుజ స్తుతిపూర్వకమైన ఈ శతకంలో విశిష్టాద్వైత సిద్ధాంతం ప్రతిపాదించబడింది. వివిధ మత సిద్ధాంత ప్రవక్తలను గూర్చి తెలుగులో వెలువడిన శతకాలలో ఇది విశిష్టమైంది. ఈ శతక కర్త ఎవరో ఎప్పటివాడో తెలిసికొనుటకు సరియైన ఆధారాలు లేక శూద్ర కులజుడు రచించినట్లుగా ఒకటిరెండు పద్యాలవలన ఊహింప వీలగుచున్నది. రామానుజాచార్యులు ఆ సూరి కులజుడు. కేశవుని పుత్రుడు. ఈతడు యాదవ ప్రకాశునివద్ద శాస్త్రవిద్య లభ్యసించిన సందర్భంలో జరిగిన ఒకానొక శాస్త్ర చర్చ ఈ పద్యంలో ప్రస్తా వించబడింది. ఛాందగ్యోపనిషత్తులో "తస్య యథాకప్యాసం పుండ రీక మేవ మక్షిణీ" అను వాక్యార్థమును గురువుగారు 'కప్యాసం' అనే పదానికి మర్కట పృష్ఠమని అర్థం చెప్పి భగవంతుని కన్నులు అట్లుంటాయని వ్యాఖ్యానించినాడట. అక్కడే ఉన్న రామానుజా చార్యులు ఈ వివరణము సరియైంది కాదని విన్నవిస్తూ అందులో అంతరార్యాన్ని రమ్యంగా నిర్దేశించినాడు. రామానుజుని వ్యాఖ్యానం సరస రమణీయమైంది. "కప్యాసం" అనే పదానికి ఆచార్యులు వివ రించిన అర్థమిది : - కపి అనగా జలమును త్రాగువాడు సూర్యుడు-

ఆతనిచే వికసింపజేయబడునది పద్మము. నాళముతో కూడిన పద్మము మనోజ్ఞమైంది అనే అర్థాన్ని, జలమునందు గలది పద్మమను అర్థాన్ని కూడా గ్రహించవచ్చును. నీటిలో జన్మించినది, తూడుతో సుందరమైనది, సూర్యుని కిరణాలతో వికసించేది అగునటువంటి పద్మము వలె వికసిత విశాలనేత్ర శోభితుడు పరమాత్ముడని రమణీయమైన ఉపమానంచే శ్రుతివాక్యానికి అర్థాన్ని వివరించినాడు. ఆచార్య రామానుజుని పాండిత్య వైభవము, వ్యాఖ్యాన శక్తి, ఆలోచనా విధానమట్టిది. ఈ విధంగానే కవులు కొందరు బుద్ధుడు, క్రీస్తు. మొదలగు అవతారమూర్తులనుగూర్చి శతకాలు రచించి తెలుగు శతక సాహిత్యాన్ని పరిపుష్టమొనర్చినారు. ఆచార్య బోధి భాస్కరులు "బుద్ధశతకం"లో బుద్ధుని అహింసా తత్త్వాన్ని, ప్రపంచానికతడొసగిన సందేశాన్ని వివరించినారు. బుద్ధుడాధ్యాత్మిక తత్త్వమునందే కాక లౌకికవిద్యలందు నిష్ణాతుడు. భాషాశాస్త్రమున కాతడొనర్చిన సేవ దేశ విదేశములకు వ్యాప్తమై ఆ రంగమున ఆసక్తిగలవారికి ఆదర్శప్రాయమైనది. బోధిభాస్కరు లీ అంశమును ప్రస్తావించి కొందరు పండితులు భావించినట్లుగా ఆ శాస్త్రమితరుల సృష్టి కాదనియు బుద్ధుడే దానికి సరిఅయిన రూపకల్పనము గావించెనని ఇట్లు ప్రస్తుతించెను.

డయలెక్టిక్సనవడ డబ్బ సొమ్మగును, పో, డంబంబుగాఁ బల్కగ
నియమింప దొలినీవు, సోక్రటీసు దానిం గ్రీసులో నేర్వడే
వయన్నించెన్నది రోముకుం, బిదప నా పాశ్చాత్య దేశమ్ములు
న్నియమంబొప్ప బఠించినంతఁ జెడునే నీ ధర్మమో బుద్ధుడా !

డయలెక్టిక్సు భారతీయులు - అందును బౌద్ధుల సొత్తు అని కవి ఆత్మ ప్రత్యయముతో వచించినాడు. ఆ విద్య గ్రీసు, రోము

మొదలగు దేశాలకు, తదనంతరము పాశ్చాత్య దేశాలకు పయనించిన దని సోదాహరణముగ బోధిభాస్కరులు నిరూపించినారు.

అక్షయ మా "ఖదీజ" ధనమంతయుఁ బేదల కిచ్చునాడు ప
ద్మాక్షి యొకింత మార్పులుక కంతయు నీదని యోర్పుగొన్న దా
దీక్ష విచిత్ర మాత్మ పరితృప్తియ సర్వమటంచెంచు నెంచె నీ
రక్షక వేలఁ బ్రోచెదుఁ బరాత్పరుడంటి వహోరసూల్ప్రభూ !

వివిధ భక్తిశతకములలో ఇస్లాం మతప్రవక్తను గూర్చి షేకు దామాదు కవి రచించిన రసూల్ప్రభు శతకం ప్రత్యేకంగా పేర్కొన దగింది. మహమ్మదు గుణగణములను కవి ఈ శతకంలో భక్తి పుర స్సరంగా కీర్తించినాడు. తెలుగులో భక్తిశతక శాఖ వివిధ దేవతా స్తుతులకు విభిన్న మత దృక్పథములకు ప్రాతినిధ్యమువహించి విశాల దృష్టిని చాటింది. భారతదేశమున మహమ్మదీయులు వ్యాపారస్థు లుగా ప్రవేశించినవారు కొందరు, మరికొందరు దండయాత్రలొనర్చి విజేతలుగ దేశముపై ఆధిపత్యము వహించినారు. క్రమముగా భారత దేశమునందు మహమ్మదీయులు ప్రత్యేక స్థానాన్ని పొందినారు. హైందవులు వారి మతవిశ్వాసములను గౌరవించినారు. "రసూల్ప్రభు" శతకము హైందవ మహమ్మదీయ మతసామరస్యమునకు ప్రతీకగా నిలుచుననుటలో ఎట్టి సందేహము లేదు.

రసూల్ప్రభువు మహమ్మదీయుల కాదర్శమూర్తి. ప్రవక్త. అతని బోధనలలో ధర్మసూక్తులెన్నియో కలవు. ఈ పద్యమునందు శతక కర్త రసూల్‌గారి జీవితములోని ఒకానొక సంఘటనను, అతని దయార్ద్రహృదయమును వితరణగుణమును ప్రశంసించినాడు. మహమ్మదు కాలమున "ఖదీజ" అను విగత భర్తృక యొకతె వర్తక వ్యాపారములొనర్చి లక్షలు గడించింది. ఈ వ్యాపారమునందామెకు

ఎందరోతోడ్పడినారు. మహమ్మదు ఆమెకు కుడిభుజమై నిలిచినాడు. కుబేరుని ధనాగారమంతమైనది. "ఖతీజ" సంపాదనము - అతుయమైన ధనరాసులామెకు స్థిరకీర్తిని గడించినవి. ఈ వ్యాపారమున మహమ్మదుపై ఖదీజకు సాటిలేని భక్తివిశ్వాసములు కలిగినవి. ఆత్మ ధనము నాతనికి సమర్పించుకొన్నది. వయసులో మహమ్మదు కంటె దాదాపు ఇరువదేండ్లు పెద్ద. మహమ్మదుగారు ఆమెను చేరదీసి పరిణయమాడినాడు. రసూల్ ప్రభువు 'ఖదీజ' ధనరాసులను పేదలకు ధారవోసినాడు. ఆత్మ ప్రభువు చేయు దానధర్మాలతో 'ఖదీజ' అలుక వహించక అందులోనే ఆత్మతృప్తినొందింది. ప్రభువే సర్వస్వమని భావించింది. తనకును తన ధనరాసులకును ప్రభువు ఆతడే అని విశ్వసించినపుడామె కిసుమంత విచారము కలగకుండుట సహజమే కదా !

తొలిదశలో వర్తక వ్యాపారాదులొనర్చి అనంతరకాలంలో భారతదేశంపై దండెత్తి మహమ్మదీయులు విజేతలై ఇచ్చట రాజ్యమును స్థాపించినట్లే విదేశీయులెందరో డచ్చి, పోర్చుగీసు, ఫ్రెంచి, ఆంగ్లేయులు మనదేశానికివచ్చి వర్తక వ్యాపారను లారంభించినారు. క్రమంగా స్థానిక రాజకీయాలలో జోక్యం కలిగించుకొన్నారు. చివరికి ఆంగ్లేయులు ఈస్టిండియా కంపెనీ మూలాన దేశంలో ఆంగ్ల ప్రభుత్వాన్ని స్థాపించినారు. వీరందరితోపాటు క్రైస్తవులీదేశంలో ప్రవేశించి పాదరీమత ప్రచారానికి పూనుకొన్నారు. మహమ్మదీయులతోపాటు భారతదేశంలో కూడా క్రైస్తవుల సంఖ్య క్రమంగా పెరిగింది. మతప్రచార కేంద్రాలు - చర్చిలు నలుమూలల వెలసినాయి. భారతీయులీమతాన్ని కూడ ఆదరించినారు - తెలుగులో ఈ మతానికి సంబంధించిన సాహిత్యమెంతో వెలువడింది. క్రీస్తునుగూర్చి స్తోత్రాలు - దండనాలు, మంగళహారతులు, శతకాలు తెలుగు ప్రక్రియల కనుగుణంగా రచింపబడినవి. ఇటువంటిశతకాల్లో చౌదరి

పురుషోత్తము కవి రచించిన ఏసునాయక ఏసుక్రీస్తు ప్రభు శతకాలు విశిష్టమైనవి. పురుషోత్తమ కవి సంస్కృతాంధ్రభాషలో పాండిత్యాన్ని గడించినాడు. ప్రాచీనాంధ్ర కావ్యములను తుణ్ణంగా చదువుకొన్నాడు. పూర్వశతకాలధోరణిలో సాగిన ఈ కవి రచించిన శతకాలశైలి ఈ అంశాన్ని నిరూపిస్తున్నది. ఈ రెండు శతకాలలోని పద్యాలు హృద్యమైనశైలిని సంతరించుకొన్నవి "అనుపమచిత్తశాంతి, సుఖ మారడి బుచ్చితి, నిత్యముక్తి సాధన ధనరాశితో గొడితి." అని పశ్చాత్తాపమును ప్రకటించి చౌదరి పురుషోత్తమ కవి వైరాగ్య భావములను వ్యక్తీకరించినాడు. ఏసుక్రీస్తు అనుగ్రహాములేదని భావించి ఈ కవి కూడ ప్రాచీనభక్తి శతక కర్తల వలె క్రీస్తు నిట్లు తూలనాడినాడు.

> ఎన్నటిచుట్టమో "మరియు" యెన్నటిబంధువో "లాజరుండు"సీ
> కెన్నటి కూర్మివిందో, మృతివేళదలంచిన తస్కరుండు వీ
> రెన్నిక జెందినారు మరియెందరి నీ కృపచేత మోక్ష సం
> పన్నుల జేసినావు భవబంధములూడిచి యేసునాయకా.

ఈ పద్యం చదవగానే డాసినచుట్టమాశబరి "దయామతినేలినావు"— "ఏవేదంబుపఠించెతాత" మొదలగు పద్యాలు జ్ఞాపకం వస్తాయి పూర్వము భక్తులను మున్నగువారిని అనుగ్రహించినట్లు తనను ముక్తిబంధములనుండి కాపాడుమని పురుషోత్తమ కవి ఏసుక్రీస్తును ప్రార్థించినాడు.

> పడుచుల్ వేడుక బొమ్మరిండ్లి సుకలో
> బాగొప్ప నిర్మించి చొ
> ప్పడ ముగ్గుల్ పచరించి. యాడుకొని,
> యాపైనాట గొల్లించుc గ

ట్టడముల్ పాడొనరించి పోవుగతి
వేడ్కల్ నీకు, నీ విశ్వముల్
పాడమం జేసి, భరించి, మాపుటలు
నెడ్డం భక్తచింతామణీ !

భగవంతునా రూపగుణాతీతుడు. నిరాకారుడు నిర్వికారుడు. ఆతనిని కొందఱు త్రిమూర్తులరూపమున నారాయణుని దశావతార రూపములందు సంభావించి ప్రస్తుతించినారు వివిధదైవముల రూపము నను ఆరాధించినారు. క్రీస్తు, మహమ్మదు, రాముడు. రహీము — బుద్ధుడు. ఎన్నెన్ని నామములు !!! ఏ నామమున వ్యవహరించిన నేమి పరమాత్ముడొకడే. ఆతనిని వివిధ నామములతో బూజించి గుణ మాహాత్మ్యములు వర్ణించుటతో వివిధ సిద్ధాంతములు మతములావిర్భ వించి మత విద్వేష పరిస్థితులను కూడ గలిగించినవి. సాధన దశలో సగుణోపాసనము ప్రథమ సోపానమని కొందరి అభిప్రాయము. నిర్గు ణోపాసనమున భగవంతుని ధ్యానించిన ముక్తిసాధ్యమని విశ్వసించు వారు మరికొందఱు, ఇవి అన్నీ ఇట్లుండ అసలు భగవంతుడే లేడు అని నాస్తికులమతము. మానవసేవయే మాధవసేవ అని మానవు డీశ్వారాంశసంభూతుడని నిరూపించినారు మరికొందరు.

ఇన్ని మతభేదముల సారాంశము. ఏదియో ఒక దివ్యశక్తి ఈ ప్రపంచాన్ని సృష్టిని గ్రహతారకాదులకు మూలభూతమైయున్నవని భావించటమే. ప్రాచీనార్యాచీనులు కొందరు ఈ దృష్టితోనే పర మాత్మని అమేయమైనశక్తిని ప్రస్తుతించినారు. భక్తిశతక కర్తలలో అధికసంఖ్యాకుల దృష్టికూడ ఇట్టిదే. ఏ పేరున శతకం వ్రాసినా కొన్ని పద్యాలలో పరమాత్ముని మహామహిమను కీర్తించినారు. కొందఱు ప్రత్యేకంగా ఈ దృష్టితో శతకాలు వ్రాసినారు. అన్నమయ్య, సర్వేశ్వరశతకము పోతననారాయణ శతకము మొద

లగు వానిలో ఇట్టి భావములే వ్యక్తీకరింపబడినాయి. ఆధునికులలో ఇటువంటి శతకాలు వ్రాసినవారిలో వడ్డాది సుబ్బారాయకవి, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారు ప్రత్యేకంగా పేర్కొనదగినవారు. సుబ్బారాయగారి భక్తచింతామణి బహుప్రచారమునొందిన శతకం. చిలకమర్తివారి కృపాంభోనిధి శతకమిట్టిదే, "భావగాంభీర్యమునందును తత్త్వబోధనమునందును భక్తచింతామణి పద్యములు కొన్ని ప్రపంచసాహిత్యమునందలి ఏ కవితకు తీసిపోవు" అని మధునాపంతులవారు ఈ శతకాన్ని ప్రశంసించినారు. సుబ్బారాయకవిగారు ఈ శతకాన్ని 1889లో ఆరంభించి దాదాపు 225 పద్యములు రచించి 1937 వరకు అప్పుడప్పుడు 125 పద్యములుచేర్చి శతకాన్ని పూర్తి చేసినారు. ఈ శతకము దాదాపు ముప్పది కూర్పులనొంది వేలకొద్ది ప్రతులలో అచ్చైనది. తెలుగువారినింతగా ఆకర్షించిన ఆధునిక శతకమింకొకటిలేదు.

సుబ్బారాయకవి ఈ పద్యంలో సృష్టికర్త లీలావిలాసములను రమణీయంగా వర్ణించినారు. ఈశ్వరసృష్టి పడుచుల బొమ్మరిల్లువంటిదట. మాయమర్మములెరుగని పడుచువారు ఇసకలో బొమ్మరిండ్లు కట్టి అలంకరించి కొంతసేపు ఆడుకొని, ఆట ఇంతటితో పూర్తి అని వానిని పడవేసి కిలకిల నవ్వుకుంటు ఇంటికి వెళ్ళిపోయే తత్త్వమే ఈశ్వర సృష్టితత్త్వము. ప్రపంచాన్ని సృష్టించటం, చక్కగా కాపాడటం, మళ్ళీ కొన్నాళ్ళకు రూపుమాపటం ఈశ్వరుని లీలావినోద కార్యక్రమము. దీనినే తాత్త్వికులు సృష్టిస్థితి లయములని పేర్కొన్నారు. బ్రహ్మను సృష్టికర్త అని, నారాయణుని స్థితికారుడని పరమేశ్వరుడు లయమొనర్చువాడని కల్పించటంతో కథ ఆరంభమైంది. దేవుండ్ల సంఖ్య పెరిగింది. మతములు పెక్కు రూపాలతో అవతరించినవి. ఈ చిక్కులో పడకుండా పరమేశ్వరుని భక్తచింతామణిగా

ఆరాధించటమే మానవునిధ్యేయంగా ఉండాలని సుబ్బారాయకవి ఈ శతకంలో ప్రబోధించినారు.

> తమకున్ దగ్గని దానిఁ గోరుదురు సంతానంబు నెప్పట్లఁ బ్రాజ్ఞమతుల్, సిగ్గెడుదానినెట్టి కుమతుల్ గాఞింప; రట్లౌదటనో యమ; యిందుగల శ్లేషశ్లేష్మరుజయందైనన్ సమర్థించి నా కోమరుం దగ్గనివానిఁ జేయు మది నాకుం జాలు కామేశ్వరీ!

వరకవుల కవితాశక్తి అమోఘమైంది. సూర్యుడారాధించి మయూరుడు కుష్ఠురోగ విముక్తుడయ్యెనని ప్రతీతి. "ఆరోగ్యం భాస్కరా దిచ్చేత్" అని ఆర్యోక్తి. కవులు తమ కష్టనిష్ఠురాలను ఆత్మనివేదన రూపంలో ఇష్టదైవములకు విన్నవించుకొనుట పరిపాటి. కవితాశక్తి వలన దైవానుగ్రహము నొందిన కవులనేకులు. అధునిక యుగంలో అటువంటి దివ్య కవితాశక్తి సంపన్నులు తిరుపతి వేంకట కవులు. వీరు కామేశ్వరీ భాస్కర మృత్యుంజయాది దైవములను నుతించి తమకు, సతీసుతులకు స్వాస్థ్యము నర్థించి ఫలాన్ని సాధించినారు. చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రిగారు కామేశ్వరీ వరప్రసాద కవితాధురీణులు. శాస్త్రిగారు తమ పుత్రుడగు కామేశ్వరశాస్త్రి శ్వాసరోగపీడితుడైన సందర్భమున రోగ నివారణార్థం ఇష్టదైవమగు కామేశ్వరీ దేవిపై శతకాన్ని రచించినారు. ఇదే ఆరోగ్య కామేశ్వరీ శతకం. పుత్రుని బాధను చూడలేనిస్థితి వర్ణించునపుడును శాస్త్రిగారు సహజ కవితా చమత్కృలని చాటినారు. తండ్రి పుత్రుని వలన పరాజయము కోరును. తనయుడు తనను మించవలయునని తండ్రి తపించును. శాస్త్రిగారు కూడ ఆ ధోరణిలో దేవిని ప్రార్థించినారు. తనకు దగ్గనివాని అనగా తగ్గినస్థితిలో నున్నవానినిగా జేయుమని వేంకటశాస్త్రిగారు దేవికి విన్నవించినారు. "తనకు దగ్గనివాని..." అను భాగము శ్లేషచమత్కృతి - దగ్గులేనివానిని...అని. ఈ శ్లేష

చమత్కృతిని శ్లేష్మరోగమునందైనా సమర్థించి కుమారుని వేంకట శాస్త్రిగారు దేవిని ప్రస్తుతించినారు. మృత్యుంజయ శతకములోను, భాస్కర శతకంలోను తిరుపతి కవులు తమస్వాస్థ్యము కొరకై ఆయా దైవములను ప్రార్థించినారు. మృత్యువుతో హోరాహోరి స్పర్థ జరిగినట్లే బాధబడి శయ్యపై పరుండి ఆశువుగా మృత్యుంజయ శతకాన్ని రచించటం, భాస్కరుని ప్రస్తుతించి వ్యాధి విముక్తులు కావటం కవికవితకుగల శక్తిని ఇష్టదైవముల పట్ల విశ్వాసాన్ని, వారి అనుగ్రహాన్ని వ్యక్తీకరిస్తున్నవి.

వరవర్ణ విలసితమగుట
సురచిర పాకాంచితగుణ శోభితమగుటన్
సరసమగుట నిన్నుమనో
హరకావ్యమనంగ వలయునమృతాంజనమా !

"ఆంధ్రపత్రికతోడ నమృతాంజనంబిచ్చి తలనొప్పి బాపిన ధన్యుడెవడు" అని కవి బండితులు కొందఱు వివిధ రంగాలలో నపారమైన సేవచేసిన కి. శే. నాగేశ్వరరావు పంతులుగారిని ప్రస్తుతించినారు. పంతులుగారి కృషి బహుముఖమైంది. రాజకీయ ఉద్యమాన్ని నిర్వహించి తెలుగువారిలో జాతీయోద్యమ చైతన్యాన్ని కలిగించి మహాత్మునికి కుడిభుజముగా నిలిచినారు. వారిచేయూతలేని సాహిత్య, సామాజిక సాంస్కృతిక కార్యక్రమము లేదంటే అతిశయోక్తికాదు. "అమృతాంజనము" అనే ఔషధాన్ని సిద్ధము చేయించి లక్షలు గడించినారు. వారి దివ్యస్మృతి చిహ్నములుగా వెలిగే దీపాలలో "అమృతాంజనము" ఒకటి. వ్యాపారాభివృద్ధికి, ప్రకటన ప్రచారము లాద్యములైన సాధనాలని ఆర్థిక శాస్త్రవేత్తలు బోధించే మొదటి పాఠం. 'వస్తు' గుణమును ప్రాధాన్యాన్ని అవి నిరూపిస్తుంటాయి. కొందరు సామాన్యమైన వస్తువులను ప్రచార

బలంతో అధికంగా విక్రయిస్తారు. కాని అది మూడునాళ్ళ ముచ్చటయే. మంత్రబలముకంటె తుంపిళ్ళబల మెక్కువ అన్నది వారి ధోరణితో సార్థకమౌతుంది. పంతులుగారొనర్చిన వ్యాపార మటువంటిది కాదు. వస్తువు బంగారం వంటిది. ప్రచారసాధనాలు దానికి సౌరభాన్ని చేకూర్చినాయి. ఈ ఔషధ ప్రశస్తిని కర పత్రములు, పత్రికా ప్రకటనలు నానావిధాలుగ చాటినవి. దీనికితోడుగ వ్యాపార ప్రకటనం కావ్యరూపంలో అందులోను శతకరూపంలో సాగటం శతక వాఙ్మయానికి అలంకార ప్రాయమైంది. కరి నారాయణాచార్యులుగారు "అమృతాంజనము" నకు సంబంధించిన అనేకాంశములకు కావ్య గౌరవము కలిగించినారు. సువర్ణముతో నొప్పు అంజనము-అందమైన చిన్నసీసా, మూత, పేటిక, వివిధ భాషలలో గల ఔషధ గుణ కీర్తన పత్రము, మొదలగు వానిని నారాయణాచార్యకవి మనోహరములగు కల్పనలతో వర్ణించిన శతకమే "అమృతాంజన శతకము". ఈ శతకము కేవలము ప్రచార గ్రంధముకాదు. మనోజ్ఞమైన కావ్యం. అమృతాంజనము కూడ హృద్యమైన కావ్యమువంటిదని కవి ఈ పద్యంలో వివరించిన రీతి గమనించండి. నన్నెచోడాదులు హృద్య కావ్యమును శ్లేష కల్పనలతో వర్ణించినట్లున్నది. ఇంపైన కావ్యమువలె అమృతాంజనము కర వర్ణము సురుచిర పాకముతో సరసమైనదని నారాయణాచార్య కవి ప్రస్తుతించినారు. శతక కవులు వస్తు వైలక్షణ్యమును పాటించిన విధము పరిశీలింపార్హము.

నవ యువకుల పెండ్లిండ్లకు
తమనీతో చేయబడ్డ దండలుమేలై
జవరాండ్రు సంతసింతురు
ప్రవిమల సత్కీర్తి లబ్ధి రహినివకోడే!

అతి సామాన్యమైన వస్తువునకు గౌరవమును కలిగించిన వారిలో శతకకవులు అగ్రేసరులు. పకోడే-విసనకర్ర-చీపురు పుల్ల శతకము లీ కోవకు చెందిన శతకాలు, ఇవి హాస్యప్రధానములు కవులు అన్యాపదేశ రీతిలో, ఉక్తి వైచిత్ర్యమున కొన్ని నీతులను కూడ ఉపదేశించినారు. హాస్యముతోపాటు చమత్కార గుణము కూడ వర్ణనలకు వన్నె దెచ్చింది. ఈ శతకము నెవరు రచించిరో తెలియదు. దీన్ని 1925 లో ఆంధ్ర జాతీయ గ్రంథమండలి వారు ప్రకటించి "జనసామాన్యమునకు రుచికరమగునట్లు కవి శేఖరులచే చేయబడి పండితులచే పరిష్కరింపబడియే" అని తెలిపినారు. రుచి కరమగునట్లు కవి శేఖరులు చేసిన పకోడి ఇది. ఈ కవి పకోడీ మహిమను నానావిధాలుగా చమత్కార పూర్వకముగా హాస్య ధోరణిలో వర్ణించినాడు. కీ. శే. చిలకమర్తి లక్ష్మి నరసింహము పంతులుగారు 'పకోడీ'ని వర్ణిస్తూ ఆశువుగా కొన్ని పద్యములు చెప్పియుండిరి. కోడిని తిననివారికి, శాఖాహారులకు దానితో సమానమైన రుచికరమైన పదార్థమును 'పకోడి'గ బ్రహ్మసృష్టించేనని చిలకమర్తివారు వర్ణించిరి. "ఈ కోళ్లెయింత దెచ్చెను, మా కోరిక పైన ధాత మాకొసగె"అని ఈ శతకకర్త వచించినాడు. పెండ్లిండ్ల సందర్భాన తలంబ్రాలు, ఆశీర్వచనార్థము అక్షతలు ప్రయోగించటం ఆచారం. మంగళాస్పదములైన అక్షతలు వచ్చిపోయేవారి కాళ్ళ క్రిందనలిగి పోతుంటాయి. వానికి బదులుగా పకోడీలు . చల్లితే అతిథులు వానిని త్రొక్కక తీసికొని తింటు హాయిగా కూర్చోవచ్చు ననీ, పెళ్ళిపీటలపై కూర్చున్న వధూవరులకు పకోడిల దండలువేస్తే గుమగుమల నాఘ్రాణిస్తూ సమయంవస్తే ఒకటి రెండు నములు కుంటూ కాలక్షేపం చేయవచ్చుననీ, కవి సూచించటం హృద్యంగా ఉన్నది. ఈ వర్ణనలలోని వ్యంగ్య చమత్కృతి హాస్యప్రధానమైంది. ప్రతి పద్యంలోను కవి పకోడి ప్రశస్తిని చాటినాడు. దానికై విని యోగించే ప్రతి పదార్థము సెనగపిండి, అల్లము, మిరపకాయ,

కారపుపొడి, ఏదో ఒక గుణముకలది అని అన్ని గుణములు రాశీ భూతమై పకోడీరూపమున అవతరించినదని కవి వివరించి అది అత్యంత ఆరోగ్యకరమైన రుచిగల పదార్థమని నోరూర వర్ణించినాడు. ఈ శతకకర్త పద్యాన తెలుగు శతకానికి పకోడి రుచికూడ కలిగింది.

కలగవు కమలంబులు, హా
సలుగదలపు, చూడవమ్మ నెవరో
తలక్రిందుగ నాకాశము
నిలిపిన వారత్త! చెఱువునీళుల లోనన్

తెలుగుపై ప్రాకృత సంస్కృతభాషా సాహిత్యప్రభావము ప్రాచీనకాలంనుండి ప్రస్ఫుటంగా ఉన్నది. తెలుగుగడ్డపై స్థాపించ బడిన మొదటి సామ్రాజ్యం సాతవాహనులది. వారు ప్రాకృతమును రాజభాషగ గౌరవించినారు. వారిలో హాలుడు సరసకవితా వినోది. కవి పండిత పోషకుడు. సుప్రసిద్ధ ప్రాకృతకవుల ముక్తకములను గాథాసప్తశతి పేర సంతరించినాడు. ఈ కావ్య మేడు శతకాల సంపుటి. ధ్వని శృంగారప్రధానములైన ముక్తకాలకు దీనికిసాటి వచ్చునట్టివి లేవనియే చెప్పవచ్చు. తెలుగు వారు ఈ కావ్యాన్ని గారాబుపట్టిగ మన్నించినారు. ఈ కావ్యసౌందర్యాన్ని ఆంధ్రాను వాద రూపంలో తెలుగువారికి అందించిన కీర్తి శ్రీనాథునిది. అతడు సంతరించిన శాలివాహన సప్తశతి నేడ లభ్యము. ఇటీవల ఈ కావ్యము లోని ముక్తకాలను కొన్ని భాగములందును, సంపూర్ణంగాను అనువదించి ప్రకటించిన వారిలో రాళ్ళపల్లివారును, గట్టి లక్ష్మీ నరసింహశాస్త్రిలు ప్రధానంగా పేర్కొనదగినవారు. అన్నివాదాల్లో రాళ్ళపల్లి వారి అనువాదం రత్నంవంటిదని సహృదయ విమర్శకుల అభిప్రాయం. మూలాన్ని అతిశయించక కుదించక, యథాతథంగా అనుకూలమైన ఛందములో రమణీయంగా అనువదించినవారు రాళ్ళ

పల్లి అనంత కృష్ణశర్మ. అనువాదమెంత సరసమైందో, హృద్యమైందో, పై పద్యమే తార్కాణం. మాతృకలో ధ్వని, వ్యంగ్య, చమత్కృతిని అనువాదమునందును మనోజ్ఞంగా దర్శింపజేసినారు. గాథాకవుల కల్పనలు పాయలు పాయలై ప్రవహించే నదీనదములవంటివి. ప్రకృతివర్ణనలో సరసశృంగారాన్ని ధ్వనింపజేసినారు. నీతి బోధక ములగు గాథలందును హృద్యమైన శృంగారమే గర్భితము. ఒకానొక నారీమణి ఒక అత్తగారికి ఎదుట కనిపించే కమల వనకమనీయ సౌందర్యాన్ని ఎంత సహజంగా వర్ణించి తెలిపిందో గమనించండి. అది నిశ్చలమైన సరోవరం. కమలములు కదలవు—హంసలు కదలవు- ఆకాశమునే తలక్రిందులుగా చెఱువు నీళ్ళలో నిలపినట్లుగా ఉన్నదట నీలిమాకాశము సరోవరంలో అచ్చంగా ప్రతిబింబించింది. పదే పదే తిరిగినా, గాడ్పులు వీచినా సరోవరమంత నిశ్చలంగా ఉండదు. దట్టమైన లతాని కుంజములతో ఆవరింపబడి ఉన్న చెఱువు అది. జాడ సంచారంలేనిది - సుందరదృశ్య పూర్ణమైంది. కామినీ కాముకు లకు అందమైన సంకేత స్థలమది. సరోవరవర్ణన వ్యాజమున తన అత్తగారి ఎదుటనే ప్రియునకు అది చక్కని సంకేత స్థలమని సూచిస్తున్న నాయక ఎంతటి జాణ !!!

సంస్కృతమునగల భర్తృహరి సుభాషిత త్రిశతి, అమరుకము, సూర్యశతకము, మూకపంచశతి, ఆర్యాసప్తశతి, భావశతక, కలి విడంబన సభారంజన, మహిష శతకాదులను హిందీలోని బహారి సప్త శతి మొదలగువానిని ఆంధ్రీకరించి శతక వాఙ్మయాన్ని తెలుగు వారు పరిపుష్టం చేసికొన్నారు. తెలుగు శతకాల వైశిష్ట్యమును గుర్తించి కొన్ని శతకాలను సంస్కృత, తమిళ, కన్నడ, ఫ్రెంచి ఆంగ్ల, ఉర్దూ, హిందీ మున్నగు భాషల్లోనికి ఆయా భాషలందు ప్రవీణులైనవారు అనువదించి తెలుగు శతక సౌరభాన్ని దిగంతాల గుబాళింపజేసినారు. గాథాసప్తశతికి దీటుగా నిలువగలిగింది బీహారి

కవి హిందీలో రచించిన బీహారి సప్తశతి. చల్లా లక్ష్మీనారాయణ శాస్త్రిగారు బీహారి సప్తశతి ఆంధ్రీకరించి దాని ప్రశస్తిని తెలుగు వారికి చాటినారు. ఒక్కొక్క శతకాన్ని ఒక్కొక్క జల్లుగను, ఒక్కొక్క ముక్తకాన్ని ఒక్కొక్క తుంపిరిగను పేర్కొని శాస్త్రి గారు తమ అనువాదాన్ని విరివానగా ప్రకటించినారు. హిందీ మండలమునుండి శతక మేఘము పయనించి తెలుగు క్షేత్రమున విరి వాన కురిపించింది. ఆ సౌరభముతో తెలుగు పొలము సువాసించి నది. బీహారి కవి ధ్వని శృంగార ప్రధానమైన ముక్తక వైశిష్ట్య మెట్టిదో శాస్త్రిగారి అనువాద పద్యమున గమనించండి.

వ్యయము తగ్గించుకొన లోభియైన మామ
చిట్టిచేతుల బిచ్చము పెట్టుమనుచుఁ
గోడలని నిల్పఁ బురిలోని కోడెగాండ్రు
బిచ్చగాండ్రౌచు మూగిరి బిచ్చమునకు.

ఒకానొక వ్యక్తి తన చేతితో బిచ్చము పెట్టితే "ఖర్చు" అధికమని క్రొత్తకోడలికి ఆ పని అప్పగించినాడు. ఆమె చిట్టిచేతు లతో బిచ్చము పెట్టితే వ్యయము తగ్గునని ఆశించినాడు. కాని కథ అడ్డము తిరిగింది. ఆమెచేత 'భిక్ష' పొందాలని యువకులందరు భిక్షు కులై రావటంవల్ల ఇల్లు గుల్ల అయింది. మామగారి లోభగుణాన్ని కోడలి సౌందర్యాన్ని కవి రమణీయంగా వ్యంగ్యంగా చిత్రించి నాడు.

ఇంత మేఘపు తున్క యే మూలనో తోచి
యంతలో గగనంబు నాక్రమించు
నొక్కింత సేపట కుఱుములు మెఱుములై
కనుగొనరాక చీకట్లు గ్రమ్మ

నంతలో జడివాన అన్ని దిక్కుల నుండి
వరదలే ప్రణయంబు వచ్చినట్టు
లావంత తడవులో నంతటి సుడి మాని
యరకాలు తడికాని యవని యగును

సుంతలో దిక్కులన్నియు సొబగు గాంచు
నింతలోననె నీలమై యొసగు మిన్ను
నింద్రజాలముగా దోచు నిచట వాన
హిమగిరి మాహాత్మ్యమెన్నదగునె.

వస్తు వైలక్షణ్యమున ఆంధ్ర శతక కర్తలు వినూత్న మార్గ ముల ననుసరించి శతక వాఙ్మయమును శాఖోపశాఖలుగా విస్తరిల్ల జేసినారు. వీనిలో వర్ణనాత్మక శతకము లలంకార ప్రాయములు. ఈ శాఖకు మణికిరీటమువంటిది 'త్యాగి' రచించిన హిమగిరి శతకము. ప్రకృతి దృశ్యములను స్వభావోక్తి రమణీయంగా చిత్రసదృశము లుగా వర్ణించుటలో 'త్యాగి' కవి లేఖిని చిత్రకారుని కుంచెయైనది. భారతదేశమునకు హిమాలయము హిమరత్న మకుటప్రాయమై బలిష్ఠ మైన పెట్టని తోటయై ప్రకృతి చైతన్యమును మూర్తీభవించు కొన్నది. ఇచట సంస్కృత నాగరికత - ఆచార వ్యవహారములు - ప్రజల జీవన విధానము - ప్రకృతి సంపద - ఇది అది అనటమెందు లకు !!! ప్రతి అణువు వినూత్న శోభాలంకృతము. మనోజ్ఞమైన ప్రకృతి రామణీయకమునకిది పుట్టినిల్లు. పారశీక కవులు కొందరు స్వర్గమును జూడనివారు కాశ్మీరమును దర్శించిన జాలునని వర్ణించి యుండిరి. సృష్టి సౌందర్యము దర్శించు కుతూహలము గలవారొక క్షణము హిమాలయ పరిసరమున నున్న జాలును. 'త్యాగి' ఈ ప్రాంతమునందలి విశేషములను గ్రహించు రీతిలో హిమగిరి శతక

మును వర్ణనాత్మకముగ విజ్ఞానకోశముగ రచించినారు. 'త్యాగి' వంటి ద్రష్టలు రచించిన ఈ శతకము నాస్పృషిః కురుతే కావ్యమను సూక్తికి లక్ష్యముగా ఉన్నది. హిమగిరి సింహాసనమునకు ఛత్రప్రాయమైన గగనమండలమును, చిత్రకారునివలె త్యాగి కవి వర్ణించిన పద్యమిది. ప్రకృతిశోభనింత రసవంతముగ చిత్రించిన శతక మింకొకటి లేదు. ఇసుమంత మేఘశకల మే మూలనో తోచి ఒకటి రెండు క్షణాలలో 'ఇంతింతయె' ఆకాశమండలము నావరించింది. కన్నుమూసి తెరచి నంతలో సింహనాదము చేయు మేఘములు దట్టముగా వ్యాపించి చిమ్మచీకట్లను గలిగించినవి. జడివాన ప్రారంభమై ప్రళయమేర్పడి నట్లు వరదలు పారును. రెండు మూడు క్షణములలో ఎక్కడి వాళ్లు అక్కడ 'గప్‌చుప్' అన్నట్లు మబ్బులు మటుమాయమగును. నీటి చుక్క కనిపించదు. భూమిపై పాదమానితే తడి అంటదు. దిక్కు లన్నీ స్వచ్ఛమై ఆకాశము నీలిశోభతో నింపారును. అయిదారు నిమిషాలలోని పరిస్థితి ఇది. దీనిని ఇంద్రజాలము అని 'త్యాగి' భావించినాడు. మహేంద్రజాలమనినను అతిశయోక్తి లేదు. హిమ గిరి పరిసరముల లోని దృశ్యమును కవి కన్నులకద్దినట్లుగా వర్ణించి నాడు. ఇటువంటి వర్ణనాత్మక శతకములు కొన్నిమాత్రమే వెలు వడినవి. అష్టాదశ వర్ణనల నచ్చమైన రీతిలో చేయవచ్చుననీ పదాడంబరము లేక సామాన్యపదాలలో "ఇంద్రజాలమును" చూపించ వచ్చుననీ శతక కర్తలు చాటి ప్రబంధ కవులకు పాఠము చెప్పినట్లు పద్యరచన గావించినారు.

మహిమన్ శిష్టుల నోటబుట్టి, కవి సమ్మానంబునన్ దేవవాక్
సహవాసంబునుబొంది, వ్యాకరణ రక్షాబంధ సూత్రాలచే
మహనీయస్థితిగాంచి, పండితులకే మాన్యంబుగా నిల్చునీ
బహుకావ్యోద్ధృత భాషసాధ్యమగు నే భాషింపగా భారతీ!

ఈ పద్యం చదువుటతో రామరాజ భూషణుని "మహిమన్ వాగను శాసనుండు సృజయింపన్'' అనే పద్యంస్ఫురణకు వస్తుంది. ఇదిగిడుగు సీతాపతిగారి భారతీశతకంలోనిది. శాస్త్రగ్రంథాలు పద్యరూపమున వ్రాసినచో అవి కంఠస్థములగుట సులభం. శతక రూపంలోను ఎన్నియో శాస్త్ర గ్రంథాలు వెలువడినవి. భాషా వ్యాకరణ విశేషాలు, జ్యోతిషము, వైద్యము, అర్థికశాస్త్రము, మొదలగు శాస్త్ర విశేషాల్ని తెలుగుకవులు కొందరు శతక రూపమున సంతరించి శాస్త్ర శతకములను శాఖవికాసానికి దోహదం కలిగించినారు. ఈ శాఖలో తాళ్ళపాక తిరుమలాచార్యల "రేఫఱకారములు" శతక లక్షణములు గలకృతి. దీనిలో సాధుశకట రేఫ ప్రయోగములు, వాని లక్షణములు వివరింపబడినాయి. గిడుగు రామమూర్తిగారి వాదాన్ని సమర్థిస్తూ సీతాపతిగారు ప్రాచీన కవులు ప్రయోగించిన వ్యావహారికపదములు. వైరిసమాసములు మొదలగువానినిగూర్చి సీతాపతిగారు ఈ శతకంలో చర్చించినారు. భాష సజీవస్రవంతి వంటిది మార్పులు తప్పనిసరిగ కలుగుట జీవద్భాషాలక్షణం. లాక్షణికులు కూడికూడని మానీ మానని, అంతా, ఇస్తి, మొదలగు ప్రయోగములను లక్షణవిరుద్ధము లని త్రోసిపుచ్చినారు. పండితులు వానిని సంస్కరించినారు. ప్రాస స్థానములోని ప్రయోగములనేమియు చేయలేక అవి దుష్టప్రయోగములని ఖండించినారు. సీతాపతిగారి శతకమున ప్రాచీన సాహిత్యములోని ప్రయోగముల స్వరూపాన్ని తాళపత్ర ప్రతులలోని రూపముల నాధారముగ గ్రహించి వానిసాధుత్వమును శాస్త్రపూర్వకముగ నిర్దేశించినారు. వ్యవహారమునసున్న భాషకు వ్యాకరణమేర్పడవలెను. వ్యాకరణమునననుసరించి పదప్రయోగములను సవరించుట సవ్యమైనమార్గముకాదు. తెలుగు భాష చరిత్ర అతిప్రాచీనమైంది. ప్రజలు, కవులు, దానిని మన్నించి విశిష్ట భాషగా రూపొందించినారు. ద్రావిడ భాషా జన్యమైన ఈ భాష సంస్కృత సహవాసమున

బహువిధంగా వికాసాన్ని పొందింది. లాక్షణికులు, వైయాకరణులు, దానికి ప్రామాణిక రూపమునొసగుటకు వ్యాకరణ రక్షాబంధ సూత్రములు సంతరించినారు. అది పండితులకే మాన్యమైనది. ప్రజలనోట జన వ్యవహారమునగల స్వచ్ఛమైన తెనుగుభాష అక్కడక్కడ ఆ కావ్యాలలో విశిష్టస్థానాన్ని పొందింది. ఆ చరిత్ర అంతా అత్యంత ప్రాచీనమైంది. పరిశోధన అవసరం అని సీతాపతిగారు ఈ శతక రూపమున ఎన్నో విశేషాలను వెల్లడించినారు. భాషా వ్యాకరణాంశములను నిఘంటువులను, వివిధ శాస్త్రములను శతకరూపమున సంతరించిన కీర్తి తెలుగువారికే లభించింది. గ్రామ్యభాష, జానపదుల చిత్తవృత్తి. వారి అజ్ఞానమును పరిశీలించటానికి తోడ్పడే శతకము చంద్రశేఖర శతకం - అధిక్షేప ప్రధానమైన ఈ శతకము గ్రామ్య భాషలో రచింపబడింది. కవి అజ్ఞానుల మానసిక ప్రవృత్తిని వారి యాసలో వ్యక్తీకరించినాడు.

> రాతిరి సూస్తి యేసములు రమ్మెముగా గురులాన! మొన్న
> బాగోతుల సత్తెభామ, ఇనిగూడని తాపము వెల్లసేసె! మా
> పాతకురాలు! రాదవలపచ్చము, రుక్మిని సుద్దికిష్ట మీ
> యీా తెరుగానరా దని నుతించును...

గ్రామ్యభాషలోని తద్భవసరూపాలు, ఉచ్ఛారణ విధానం, ధ్వనులలో ఏర్పడే మార్పులు, మాండలిక యాస, మున్నగు భాషా శాస్త్ర విశేషాలు గ్రహించటానికి ఈ శతకం లక్ష్య గ్రంథంగా తోడ్పడుతుందనటానికే మాత్రం సందేహంలేదు.

> తిరుపతికిం బోవ యొడలి నగలెల్లదీసి యిచ్చెదరు
> హార ! వచ్చి నినుజూచి యొక నమస్కారమాచరించెదరు

వెరపించుటకు మరపించుటకు గల భేదమిద్ది హర
హర మహాదేవ శ్రీకాళహస్తీశ్వర మహాదేవ !

అఖిలభారత స్థాయిలో తెలుగు శతకమునకు పట్టము గట్టిన వారు కేంద్ర సాహిత్య అకాడమీవారు. కవిసామ్రాట్ విశ్వనాధ సత్యనారాయణగారి మధ్యాక్కరలు పది శతకముల సంపుటి. వివిధ దైవములపై మధ్యాక్కరలలో శతకములు వ్రాసిన కీర్తి విశ్వనాధ వారికి లభించినది. కేంద్రసాహిత్య అకాడమి అవార్డు లభించింది. విశ్వనాధవారి బహుముఖ సాహిత్య సేవను గుర్తించి వారికి ఇటీవల "జ్ఞాణపీఠ" అవార్డు నొసగి గౌరవించినారు. అది వారికే కాదు తెలుగు సాహిత్యమునకు జరిగిన అపూర్వ సత్కారము. విశ్వనాధ వారు అద్వైత దృష్టితో వివిధ క్షేత్రదైవములను పదిశతకముల రూప మున ప్రస్తుతించినారు. తమకులదైవమును గూర్చి వారిది వరకే 'మాస్వామి' అనుశతకమును రచించి యుండిరి. ఎట్టివస్తువును స్వీక రించినా వన్నెచిన్నెలు దిద్దుట వారి లేఖినికిగల దివ్వశక్తి. లౌకికదృ ష్టి ఆధ్యాత్మిక తత్వములో ఈ పద్యమున చమత్కార పూర్వకముగా వారుసమన్వయించినారు. ఏడుకొండల వానికి మ్రొక్కులు సమర్పిం తునని సంకల్పించినారు. తప్పని సరిగ వెళ్ళి స్వామినిదర్శించి ఒడలి నగలెల్ల సమర్పింతురు. లేనిచో వడ్డికాసులవాడు అష్టకష్టములు గలిగించి తనవద్దకు రప్పించుకొని వడ్డితో మ్రొక్కులు గ్రహించునట! ఇది లోకమునందు భక్తులాచరించెడి విధానమునకు ప్రతిబింబము. భయముతోకూడిన భక్తి అది. పరమేశ్వరాలయమునకు వెళ్ళినచో భక్తులు కేవలమొక నమస్కారము చేతురు. హరిహరులలోని భేద మిది అని కవి భక్తుల హృదయమున గల విభిన్న తత్త్వములను వారి చిత్తవృత్తిని సరసముగ వ్యక్తీకరించినారు, ఈ సంపుటిలోని శతక ములన్నీ పూర్వ శతకాల ధోరణిలో సాగినవి. భావ వ్యక్తికరణ

విధానంలో, నూత్నకల్పనలలో విశ్వనాథవారు ఆత్మీయతాముద్రను చూపినారు. ఆర్త పశ్చాత్తాప భావ ప్రకటనమును విశ్వనాథవారు "ఎడదగాటంపు బాధ" అని విన్నవించినారు. హృదయము దుష్టగుణ ఘూయిష్టమని, చేసిన పాపముల గణితములన్ని పూర్వ శతక కర్తలు రచించియుండిరి. దుష్టగుణములకు దుర్యోధనుని ప్రతీకగా గ్రహించి విశ్వనాథవారు, నా యెడదలో వేయిమంది దుర్యోధనులు కలరని వచించినారు. "కుబ్జ" ననుగ్రహించి గూడదీసినట్లు, మనసు వంకర దీర్పుమని ఒక శతకములో శ్రీకష్ణుని ప్రార్థించినారు. మోహము లను గోళ్ళను దీయుమనియు, ప్రేమలను ఛేదింపుమనియు, నృసిం హుని వేడినారు.

విశ్వనాథవారు తమకుగల లౌకిక జ్ఞానమును పురస్కరించు కొని తమ దృష్టికి వచ్చినదానిని, ఊహాకందిన ప్రతి అంశమును వ్యంగ్య చమత్కృతులతో సరసములైన ముక్తకములను రచించి విశ్వనాథ పంచశతిగా సంతరించినారు. గాథాసప్తశతి, అమరుకము, భర్తృహరి, అడిదము సూరకవి, కూచిమంచి సోదరులు, వేమన మొదలగు కవుల వచనావిధానము వస్తువిజ్ఞాణము - హాస్య వ్యంగ్య వైభవము రాశిబోసినట్లు విశ్వనాథవారు ముక్తకములను రచించి నారు. మతము - భాష - సమకాలిక రాజకీయములు - వ్యక్తుల విభిన్న మనస్తత్వము - ఇదీ అదీ అనటమెందుకు? విశ్వమునందలి ప్రతి అంశము ఈ ముక్తకాలలో చాయామాత్రముగ గోచరిస్తుంది. కవికి ఒకరిమీద ద్వేషముకాని ప్రేమ కాని కలుగదని ఆతడు కేవ లము చమత్కరించునని విశ్వనాథవారొక పద్యములో స్పష్టమొనర్చి నారు. వ్యంగ్య, అధిక్షేప, హాస్యప్రధానములగు ముక్తకాలలోని భావములు కవినుద్దేశించి వ్రాసినవి కావనీ చిత్తవృత్తి చిత్రీకరణమే ధ్యేయమనీ వారి భావము. ఇందు నూత్నవినూత్నములైన ఉపమాన

ములు, రూపకములు, శ్లేషచమత్కృతులు, పౌరాణికగాథల వ్యంగ్య వ్యాఖ్యానమును లోకుల చిత్తవృత్తుల కన్వయించుట ప్రత్యేకముగ గమనింపదగినవి.

ఒకనికిద్దరు పుత్రకు లుండిరేని
వేని భాగ్యమ్ము నిజముగా వానిదేను
విఘ్ను సుతులలో గుడి లేదు పెద్దవాని
కంగజుడు కొనె నెన్ని పాడైన గుళ్ళు.

తిండి లేనట్టి వారికిఁ దిండి యిడదు
తిండి కలవారి దగ్గర దీయుఁ బన్ను
ఉర్విపతికంటె దంతవైద్యుండు నయము
పన్ను కట్టును లేనట్టివాడు చనిన.

ఉదాహరించటమారంభినచో మొత్తము పంశతియే వ్రాయవలసి వచ్చునేమో !

ఆంధ్రశతక సాహిత్య వికాసమునకు వినూత్నలంకారమును సమర్పించిన కీర్తి స్మృతి కావ్యాన్ని శతకరూపంలో రచించిన వైశిష్ట్యం విశ్వనాధవారికి లభించింది. వరలక్ష్మి త్రిశతి మూడు శతకముల సంపుటి. పేరునకే భార్యాస్తికలు కాని నా శరీరమ్ము నిజము కృష్ణార్పణమ్మను పద్యము సహృదయుల నార్ద్రీభూత చేతస్కుల నొనర్చునట్టిది. కరుణ రసాత్మక సన్నివేశ చిత్రణము నందున స్వోత్కర్ష తాముద్ర వీడని వారి దృష్టి ఈ పద్యంలో చూడవచ్చు.

*

తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పొంగాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషిచేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమసాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3

COVER PRINTED AT : KODANDA PRINTERS, HYDERABAD 500 [illegible] PHONE 62163